25 సంవత్సరాలుగా పేరు మోసింది






సోలు డిస్ట్రిబ్యూటర్లు :
జె. ఎల్. మోరిసన్
సన్ & జోన్స్
(ఇండియా) ప్రైవేట్ లి.
బొంబాయి, ఢిల్లీ,
మద్రాసు, కాన్పూరు,
కలకత్తా.

Asha




Unique-M-2-TG

ఆశా స్నో, ఫేస్ పౌడర్, కుంకుం, కాజల్ తదితర సౌందర్య సాధనాలు

# నేడే చూడండి!

స్త్రీలా! పురుషులా! ఎవరధికులు?
ఈ పరమ రహస్యాన్ని తెలుసుకోవాలంటే
ప్రతివారూ విధిగా చూసితీరవలసిన పరమాద్భుత
చిత్రం!..

యస్. ఆర్. మూవీస్ వారి

# ప్రమీలార్జునీయము

దర్శకుడు
యం. మల్లిఖార్జునరావు

నిర్మాతలు
ఆదిబాబు · నాగమణి




నైజాం: ఉషా ఫిలిమ్సు, సికింద్రాబాద్. మైసూరు: శారదా మూవీస్, బెంగుళూరు. నార్త్ ఒరిస్సా: సరస్వతి పిక్చర్స్, బరంపురం.

# దిలీప్ బృందం

ఒక మధ్యాహ్నం
హాయిగా
గడుపుతున్నారు






ఇప్పుడు మనం సమానం— కెప్టెన్, నీకు ధన్యవాదాలు!

అవును! స్కోర్ 'టూ ఆల్' అయింది!

రిఫరీ ఈల ఊదుతున్నాడు!

రండయ్యా- వేగం! ఆటపూర్తయ్యేందుకు 15 నిమిషాలు మాత్రమే వుంది. మనం గెలిచితీరాలి!


















# మీ పాప ఆరోగ్యంగా పెరుగుటకు
# అమూల్ -సంతులిత ఆహారము

అమూల్ లోవున్న పదార్థములు : ప్రోటీనులు—శరీరంలో స్నాయువుల వృద్ధికి. పిండి పదార్థములు, క్రొవ్వు — శక్తి నిచ్చుటకు, బరువు ఎక్కువ చేయుటకు, కాల్షియం, భాస్వరము — బలమైన పళ్లు, దిట్టమైన ఎముకల కొరకు. ఇనుము—మంచి నెత్తురు పట్టుటకు, పాండు రోగము రాకుండా చేయుటకు. విటమిను ఎ—సూక్ష్మమైన దృష్టికి, మెత్తని చర్మం కొరకు. విటమిను బి 1 —బలమైన నరాలకు, హృదయ కండరాలను బలపరుచుట కొరకు. విటమిను బి 2—ఆరోగ్యకరమైన నోటి కొరకు. విటమిను బి 6— కండరాలను సడలించుటకొరకు. విటమిను సి—వ్యాధి నిరోధక శక్తి పెంపొందించుటకు, శీతాదవ నివారణకు. విటమిను డి—చంటి పిల్లలకు వచ్చే రికెట్ల వ్యాధి నివారణకు, బలమైన ఎముకలు, ఆరోగ్యవంతమైన పళ్లు కొరకు. నయాసినమైడ్— జీర్ణవృద్ధికి. —మీ పాపకు ఎంతో మంచిది.




తాజా పాలనుండి చేసిన **అమూల్**
పాల ఆహారములో మీ పాపకు కావలసిన
7 విటమినులు గలవు.






ASP/ABF. 40 Tel



# చందమామ

నంచాలకుడు : 'చ క్ర పా ణి'

ఈ సంచికతో "చందమామ"కు పందొమ్మిదో ఏడు ప్రారంభమవుతుంది. భారతదేశంలోని ప్రతి ప్రాంతానికీ వెళ్ళే "చందమామ"ను చూసి గడిచిన 18 ఏళ్ళలో ఎన్నో కొత్త పత్రికలు వచ్చాయి. కొన్ని పాత పత్రికలు కూడా "చందమామ"ను చూసి కొత్త పద్ధతులు అవలంబించాయి. కాని "చందమామ"కు గల ఉన్నతస్థానాన్ని మరే పత్రికా ఆక్రమించటం జరగలేదు. ఇందుకు మేమెంతో గర్విస్తున్నాము.

ఈ సంచికలో రామాయణం "యుద్ధకాండ" ముగుస్తున్నది. దాని స్థానంలో పై మాసం నుంచీ "ఉత్తరకాండ" నడుస్తుంది. అలాగే ఈ సంచికలో ముగుస్తున్న "దుర్గేశనందిని" స్థానంలో పై సంచికలో "నవాబునందిని" ప్రారంభమవుతుంది.

సంపుటి : 37 - జులై 1965 - సంచిక : 1

CHITRA



# భారత చరిత్ర




అక్బరు చనిపోయిన ఒక వారం అవతల సలీమ్ ఆగ్రాలో నూరుద్దీన్ మహమ్మద్ జహాంగీర్ పాద్‌షా ఘాజీ అనే పేరుతో పట్టం కట్టుకున్నాడు. అన్ని రకాల ప్రజల ఆదరానికీ పాత్రుడయే ఉద్దేశంతో అతను అనేక చర్యలు అమలు చేశాడు.

గద్దె ఎక్కే నాటికి జహాంగీర్ వయసు **36.** చక్రవర్తి పదవి అతనికి ఎంతో కాలం సుఖస్వప్న మనిపించకుండా, అతని పెద్ద కొడుకు ఖుస్రవ్ అతని మీద ఎదురు తిరిగాడు. ఖుస్రవ్ అంటే అక్బరుకూ, మేనమామ అయిన మానసింహుడికీ, ఇంకా అనేకమందికీ చాలా ముద్దు. అక్బరు ఇంకా చనిపోక ముందే ఖుస్రవ్‌కూ, అతని తండ్రికీ చెడింది. తండ్రి రాజ్యానికి వచ్చిన అయిదు నెలలకు ఖుస్రవ్ ఆగ్రా నుంచి పంజాబుకు పారిపోయి, అక్కడ పితూరీ లేవదీశాడు. జహాంగీర్ ఆలస్యం చెయ్యకుండా పెద్ద సేనను వెంటబెట్టుకుని, తన కొడుకు పై దండెత్తి వెళ్ళాడు.

ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో ఖుస్రవ్ చిత్తుగా ఓడిపోయాడు. అతను ఖైదు శిక్ష పొందాడు. అతని అనుచరులు చిత్రహింసలకు గురి అయారు. ఖుస్రవ్ **1622** వరకు జైలులోనే యాతన అనుభవించి చనిపోయాడు.

**1611** మే నెలలో జహాంగీర్ నూర్ జహాఁను పెళ్ళిచేసుకున్నాడు. ఆమె అసలు పేరు మిహ్రున్నిసా. ఆమె తన పదిహేడో ఏట అలీకులీబేగ్ ఇస్తర్ఝు అనే పర్షియన్‌ను పెళ్ళాడింది. ఈయన బెంగాలులోని బర్ద్వాన్‌ను జాగీరుగా పొంది, షేర్ అఫ్ఘాన్ అనే బిరుదు కూడా సంపాదించుకున్నాడు.

అయితే ఈ షేర్ అఫ్ఘాన్ తిరుగుబాటు వైఖరి అవలంబించ సాగాడు. అతన్ని శిక్షించమని జహాంగీర్ కుతుబుద్దీన్ అనే



వాణ్ణి సేనతో పంపాడు. యుద్ధంలో కుతుబుద్దీన్ చనిపోయినప్పటికీ, అతని అనుచరులు మిహ్రున్నిసా భర్తను ముక్కలు ముక్కలుగా నరికేశారు. మిహ్రున్నిసా తన పసి కూతురుతో సహా జహంగీరు రాజభవనానికి చేరి, నాలుగేళ్ళ అనంతరం చక్రవర్తిని పెళ్ళాడటమే గాక, అతని పట్టపు రాణి కూడా అయింది. ఆమెకు భర్త "నూర్‌జహాఁ" (ప్రపంచపు వెలుగు) అని పేరు పెట్టుకున్నాడు.

నూర్‌జహాఁ అద్వితీయ సౌందర్యవతీ, కళాప్రియురాలూ, తెలివిగలదీనూ. అయితే ఆమెకు అన్నిటి కన్న ఇష్టమైనది అధికారం. ఆమె తన భర్తను పూర్తిగా వశపరుచుకుని, తన తండ్రికీ, అన్నకూ కొలువులో ఉన్నత పదవు లిప్పించింది; తన మొదటి సంబంధం కుమార్తెను జహంగీర్ కడగొట్టు కొడుకైన షహర్యార్ కిచ్చి పెళ్ళి చేసి, తన ప్రతిభ మరింత పెంచుకున్నది.

జహంగీరు కాలంలో కొన్ని ప్రముఖ విజయాలు మొగలులకు లభించాయి. బెంగాలులో మొగలులకు అఫ్ఘానులు 1612 దాకా పక్కలో బల్లెంగా ఉంటూనే వచ్చారు. ఉస్మాన్‌ఖాన్ అనే వాడి నాయకత్వం కింద జరిగిన అఫ్ఘాన్ తిరుగుబాటు



1612 మార్చి 12 న అంతమయింది. తలపై దెబ్బ తగిలి ఉస్మాన్‌ఖాన్ చనిపోయాడు. అటు తరవాత బెంగాలులో అఫ్ఘానులు తల ఎత్తలేదు. అదే విధంగా మేవార్ కూడా జహంగీరు కాలంలోనే మొదటి సారిగా మొగలుల ఆధిక్యతను ఆమోదించింది.

దక్కనులో అహమ్మద్ నగరు ఒకటి మొగలులకు లొంగనే లేదు. మొగలు సేనలు అహమ్మద్ నగరుతో సుదీర్ఘమైన యుద్ధం చేశాయి. ఈ యుద్ధం నడిపిన వారిలో యువరాజు ఖుర్రమ్ కూడా వున్నాడు. ఇతను 1616 లో తాత్కాలికంగా



అహమ్మదనగరు కోటను పట్టుకున్నందుకు తండ్రి ఎంతో పొంగిపోయి అతనికి "షా జహాఁ" (ప్రపంచానికి రాజు) అన్న బిరుదూ, ఇతర కానుకలూ ఇచ్చాడు... కోట్ల కొద్దీ రూపాయలూ, వేల కొద్దీ ప్రాణాలూ బలి అయాయి, కాని దక్కనులో మొగలు సామ్రాజ్యపు సరిహద్దు 1605 నా డుండిన చోటు నుంచి ఒక్క అంగుళం ముందుకు జరగలేదు!

నూర్‌జహాఁ తనకు రావలిసిన సింహాసనాన్ని ఆమె అల్లుడైన షహర్యార్‌కు కట్టబెడుతుందని పాజహాఁ తండ్రి పై తిరుగుబాటు చేశాడు. అయితే అతను 1623లో ఓడిపోయి, 1625 లో తండ్రితో రాజీపడి, తన కొడుకులను దారాషుకోహ్, ఔరంగజేబ్‌లను రాజధానికి పంపి, తాను తన భార్య అయిన ముమ్‌తాజ్‌మహల్ తోనూ, తన ఆఖరు కొడుకైన మురాద్ తోనూ నాసికలో ఉండిపోయాడు.

షాజహాఁ ఓటమికి కారకుడు మహాబత్ ఖాన్ అనేవాడు. అతను సైనికాధికారిగా ప్రజ్ఞ చూపి పైకి వచ్చాడు. అతని ఉన్నతి చూసి ఓర్వలేక నూర్‌జహాఁ అతని పై కత్తి కట్టింది. మహాబత్‌ఖాన్ ఎదురు తిరిగి, జహాంగీర్ కాబూలుకు వెళ్ళేటప్పుడు ఆయనను పట్టుకుని ఝీలమ్‌నది ఒడ్డున ఖైదు చేశాడు. నూర్‌జహాఁ తప్పించుకు పారిపోయి, తన భర్తను విముక్తుణ్ణి చెయ్యటానికి వ్యర్థ ప్రయత్నాలు చేసి, చివరకు తిరిగి వచ్చి ఖైదులో తన భర్తను చేరుకున్నది.

చివరకు మహాబత్‌ఖాన్ కంటిలో దుమ్ము చల్లి జహాంగీర్, నూర్‌జహాఁలు బయట పడ్డారు. మహాబత్‌ఖాన్ పారిపోయి షాజహాఁ శరణుజొచ్చాడు. అయితే మరి కొద్ది రోజులకే, 1627 అక్టోబరు 28 న, జహాంగీర్ చక్రవర్తి చనిపోయాడు. అతని శవానికి రావీనది తీరాన షాహ్‌దర వద్ద అందమైన సమాధి నిర్మించారు.



# నేహ్రూ కథ

## 13



కిసానులు తమ ఉద్యమం ద్వారా తమ బలాన్ని కొంతవరకు తెలుసుకో గలిగారు. కిసాను మహాసభలు జరిగేవి. వాటికి ఒక్కొసారి 60 లేక 70 వేలమంది కిసానులు హాజ రయేవారు. వీరు ఆ సమావేశాలకు వెళ్ళటానికి టిక్కెట్లు లేకుండా ప్రయాణాలు చేశారు. రైల్వే అధికారులు ఇదేమిటంటే "కాలం మారింది," అని జవా బిచ్చేవారు! టిక్కెట్లు లేకుండా రైళ్ళలో ప్రయాణించట మనేది ఒకరు బోధించినది కాదు.

1920 ఆఖరులో ఒక సంఘటన జరిగింది. ఇది జరిగినప్పుడు జవాహర్ కలకత్తా కాంగ్రెసు సమావేశానికి వెళ్ళి ఉన్నాడు. ఏదో నేరం మోపి కొద్ది మంది కిసాను నాయకులను పోలీసులు అరెస్టు చేశారు. ప్రతాపగర్‌లో వారి విచారణ జరగవలిసి ఉండెను. విచారణ రోజున చీమల పుట్ట పగిలినట్టుగా వేలకు వేలు కిసానులు ప్రతాపగర్ చేరారు; వారు కోర్టు నిండారు, కోర్టు ఆవరణ నిండారు, జైలు నుంచి కోర్టు దాకా ఉన్న మార్గ మంతటా గుమి కూడారు! మేజిస్ట్రేటుగారికి గుండె జారిపోయి, విచారణ మర్నాటికి వాయిదా వేశాడు. మర్నాటికి గుంపులు మరింత అయాయి! చిట్టచివరకు అధికారులు అరెస్టయిన కిసాను నాయకులను వదిలి పెట్టేశారు.

దీనితో కిసానులకు ఎక్కడలేని ఆత్మవిశ్వాసమూ ఏర్పడింది; తాము సంఖ్యా బలంతో సాధించరానిది ఉండదనుకున్నారు. కాని ప్రభుత్వం వారిలో పెంపొందుతున్న ఈ బలాన్ని ఎలా సహించి ఊరుకుంటుంది? ఊరుకోలేదు.

1921 జనవరిలో జవాహర్ నాగపూరు కాంగ్రెసు సమావేశం నుంచి అలహాబాదుకు తిరిగి వచ్చే సరికి రాయబరేలీ నుంచి తంతి



వచ్చింది—పరిస్థితి ప్రమాదకరంగా పరిణ మించ బోతున్నది, వెంటనే రావాలి.

జరిగిన దేమిటంటే, కొందరు కిసాను నాయకులు అరెస్టు చేయబడి రాయబరేలీ జైలులో ఉంచబడ్డారు. ప్రతాపగర్‌లో లాగే తమ శక్తినీ, సంఖ్యాబలాన్నీ ప్రదర్శించ టానికి కిసానులు పూనుకున్నారు. అయితే ఈ సారి ప్రభుత్వం ముందే జాగ్రత్తపడింది. కిసాను గుంపులు రాయబరేలీకి వచ్చి చేర కుండా నిరోధించటానికి అదనపు పోలీసు దళాలూ, సైనికదళాలూ ఏర్పాటయాయి.

కిసాను దళాలలో హెచ్చు భాగం ఊరి వెలుపల నున్న చిన్న నది ఇవతలి ఒడ్డున ఆపబడ్డాయి. కాని ఇతర దిక్కుల నుంచి కూడా కిసాను గుంపులు వస్తున్నాయి. జవాహర్ రైలు దిగుతూనే పరిస్థితి ఇలా ఉందని విని, వెంటనే నది వద్దకు బయలు దేరాడు. దారిలో అతనికి జిల్లా మేజిస్ట్రేటు నుంచి ఒక ఉత్తరం అందింది; జవాహర్ వెనక్కు తిరిగి పోవాలన్న హెచ్చరిక అందులో ఉన్నది. తనను ఏ చట్టం తాలూకు ఏ సెక్షను కింద మేజిస్ట్రేటు తిరిగి పొమ్మన్నదీ తెలిపితేనే గాని తాను తన కార్యక్రమం మానేది లేదని జవాహర్ ఆ పత్రం వెనక భాగాన రాసి ముందుకు సాగాడు. అతను నదిని చేర వస్తూండగా కాల్పులు వినిపించాయి. వంతెన మీద అతన్ని మిలిటరీ వాళ్ళు ఆపేశారు. నది ఇవతలి ఒడ్డున పొలాలలో దాగి, భయ భ్రాంతులై ఉండిన కిసానులు కొందరు అతని చుట్టూ మూగారు. జవాహర్ అక్కడి కక్కడే రెండు వేలమంది కిసానులతో, చిన్న మీటింగు పెట్టి, ఆవేశపడవద్దనీ, భయ పడ వద్దనీ హెచ్చరించాడు. అంత దూరాన మిలిటరీ వాళ్ళు కొందరు కిసానుల పైన కాల్పులు జరుపుతుంటే ఇక్కడ ఈ మీటింగు! అది కొంతవరకు ఫలించింది. కిసానుల భయవిభ్రమం తగ్గిపోయింది.



ఇంతలో మే.స్రీటు కాల్పులు జరిగే చోటి నుంచి జవాహరు వద్దకు వచ్చి, అతన్ని తన ఇంటికి తీసుకుపోయి, ఏదో ఒక సాకుతో అతన్ని రెండుగంటల చిల్లర సేపు అక్కడే ఉంచాడు. జవాహర్ కిసాను లను గాని, ఊళ్ళో ఉన్న తన అనుచరు లను గాని కలుసుకోకుండా చూడటమే ఆయన ఉద్దేశమై ఉంటుంది.

ఈ కాల్పులకు చాలామంది కిసానులు బలి అయినట్టు తెలిసింది. అధికారులు తిరిగి పొమ్మంటే వెళ్ళకపోవటం తప్పించి కిసానులు ఎలాటి హింసాయుత చర్యలూ చేయలేదు. "నేను గాని, తమకు విశ్వాస పాత్రుడైన మరొక వ్యక్తిగాని వెళ్ళిపొమ్మని ఉంటే వాళ్ళు వెళ్ళిపోయి ఉందురు. అధికార్ల ఆజ్ఞలను శిరసావహించటం వారికి సమ్మతం కాలేదు," అంటాడు జవాహర్. జవాహర్ వచ్చినదాకా ఎట్టి చర్యా తీసుకోవద్దని మే.స్రీటును ఎవరో సూచించా రట. కాని ఆయన వినలేదు. తాను చెయ్యా లేకపోయిన పని ప్రజానాయకుడు చెయ్యా గలిగితే మే.స్రీటు హోదాకూ, ప్రభుత్వ కీర్తికీ ఎంత కళంకం!

అది మొదలు కిసానుల పైన ప్రభుత్వ దౌర్జన్యం హెచ్చింది. కిసాను ఉద్యమాన్ని



అణచి పారెయ్యటానికి ప్రభుత్వం పూను కున్నది. కిసానులు కోర్టు లెక్కటం మాని, తమ తగవులు తీర్చటానికి పంచాయితీలను ఏర్పాటు చేసుకున్నారు. కిసాను నాయకు లనూ, పంచాయితీ ప్రముఖులనూ అరెస్టు చెయ్యటమూ, కిసానులపై కాల్పులు జరప టమూ మొదలైన చర్యలతో కిసానులను అడలగొట్టటానికి ప్రభుత్వం ఉద్యమించింది. కిసానుల ఇళ్ళలో కొత్తగా వెలసిన చరఖాలు ప్రభుత్వ విద్రోహ చిహ్నా లయాయి! వాటిని ప్రభుత్వం తగలబెట్టిం చింది. ఈ ప్రభుత్వ దౌర్జన్యం రాయబరేలీ, ప్రతాపగర్ ప్రాంతాలలో జాస్తిగా సాగింది.

1921 లో ఫైజబాద్ జిల్లాలో మరొక విధంగా ప్రభుత్వ దమన విధానం ఆరంభ మయింది. కొందరు గ్రామస్తులు ఒక తాలూకాదారు ఆస్తి దోచారు. ఆ తాలూకా దారు పై కక్ష గల ఒక జమీందారు ప్రేరే పణతో ఈ దోపిడి జరిగినట్టు తరవాత బయటపడింది. వాళ్ళా దోపిడి జరపాలని మహాత్మాగాంధీ ఆదేశించి నట్టుగా వారికి చెప్పారట. ఆ దౌర్భాగ్యులు దోపిడీ సాగిస్తూ, " మహాత్మాగాంధీకీ జై!" అని నినాదాలు చేశారు!

ఈ సంగతి విని జవాహర్‌కు అమిత కోపం వచ్చింది. అతను వెంటనే ఫైజబాద్ జిల్లాలోని అక్బర్‌పూరు ప్రాంతం చేరుకుని మీటింగు ఏర్పాటు చేశాడు. చుట్టు పక్కల పది మైళ్ళ దూరం నుంచి అయిదారు వేల మంది గ్రామస్తులు హాజ రయారు. అతను చాలా కఠినంగా మాట్లాడాడు, ఇలాటి పనులు దేశద్రోహమూ, అవమానకరమూ అవుతుందన్నాడు, దోపిడీ చేసిన వాళ్ళు ముందుకు వచ్చి తమ నేరం ఒప్పుకోవా లన్నాడు. పోలీసు అధికారులు చూస్తూండ గానే రెండు డజన్లమంది చేతు లెత్తారు! వారికి దీర్ఘ శిక్షలు పడ్డాయి.

ఆ గ్రామస్తులు అభమూ శుభమూ ఎరగని అమాయకులనీ, వారిని ఇతరులు వంచిం చారనీ విన్నాక జవాహర్ నేరస్తులను బహి రంగంగా బయట పెట్టినందుకు ఎంతో నొచ్చుకున్నాడు. ఇంత కన్న దారుణ మేమి టంటే, ఈ దోపిడీ సాకుతో ప్రభుత్వం ఆ జిల్లాలో కిసాను ఉద్యమాన్ని క్రూరంగా అణచింది. వెయ్యి మందికి పైగా అరెస్టయారు. ఏడాదికి పైగా విచారణ సాగింది. విచారణ పూర్తి కాక ముందే చాలా మంది జైలులో చనిపోయారు. కొందరు కుర్రాళ్ళకు సైతం దీర్ఘ శిక్షలు పడ్డాయి. జవాహరు తానే జైలుకు వెళ్ళినప్పుడు వారిలో కొందరిని అక్కడ చూశాడు.






## 14

ఆ మర్నాడు జగతసింహుడికి దూత ద్వారా ఆయషా ఒక ఉత్తరం పంపింది. ఆ ఉత్తరంలో ఇలా ఉన్నది:

"రాజకుమారా, నిన్ను కలుసుకుని మాట్లాడలేకపోయాను. అందుకు కారణం ఉస్మాన్‌ను దహించివేస్తున్న క్రోధమూ, బాధా. నిన్ను నేను చూడనందుకు నీవు ఆగ్రహించ వనుకుంటాను. అందుచేత నాకు కలిగిన బాధను గుండె రాయి చేసుకుని సహిస్తున్నాను. నే నిప్పు డీ ఉత్తరం రాస్తున్నది దేనికంటే, నేను నిన్ను ప్రేమిస్తున్నా నన్న విషయం మరిచిపొమ్మని చెప్పటానికి. నేను నీ ప్రేమ కోర దగినంత దాన్ని కాను. నేను నీకు అర్పించవలిసిందేదో అదివరకే అర్పించాను. నీ నుంచి నే నేమీ కోరటం లేదు. నీకు మంచి రోజులు వచ్చినప్పుడు నాకు కబురుచెయ్యి. నీ కెప్పుడైనా తీరని దుఃఖం కలిగితే ఆయషాను జ్ఞాపకం చేసుకుంటావుకదూ?

"నీ వీ దేశాన్ని విడిచిపెట్టి పోతున్నావు. పఠానులు శాంత స్వభావులు కారు. అందుచేత నీవు మళ్ళీ ఈ దేశానికి రావలిసి రావచ్చును. అప్పుడు నేను నీకు కనిపించను—దీర్ఘంగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. నీకు వివాహం జరిగే పక్షంలో నాకు ముందుగా కబురు చేస్తే నేను దగ్గర ఉండి నీ వివాహం జరిపిస్తాను. నీ కాబోయే భార్య కోసం మంచి ఆభరణాలు చేర్చి

బంకించంద్ర చట్టోపాధ్యాయ



ఉంచాను. అవకాశం దొరికినప్పుడు వాటిని నేనే నీ వధువుకు స్వయంగా అలంకరిస్తాను. అయుషా చనిపోయిందని తెలిసినప్పుడు నీ వీ దేశానికి రావాలని నా కోరిక. నీ కోసం సందుగు పెట్టెలో దాచి ఉంచిన వాటిని దయతో స్వీకరించ ప్రార్థన. ఇంకేమి రాయను ? నన్ను జ్ఞాపకం చేసుకున్నప్పుడు నీకు బాధ కలగకుండా ఉండుగాక!
—అయుషా."

ఈ ఉత్తరానికి జగతసింహు డిలా జవాబు రాశాడు.

"అయుషా, నీవు స్త్రీలలో రత్నం లాంటిదానివి. నీ ఉత్తరానికి నే నిప్పు డేమీ



జవాబు రాయలేను. అందుకు నేను చాలా బాధపడుతున్నాను. నన్ను మరవ వద్దు. బతికి ఉంటే ఒక సంవత్సరం అనంతరం నీకు జవాబు రాస్తాను."

ఈ ఉత్తరం ఇచ్చి జగతసింహుడు అయుషా దూతను పంపేశాడు.

మొగలులకూ పఠానులకూ సంధి జరిగినాక వీరేంద్రసింహుడి భార్యా, కుమార్తే, వారితో బాటు అభిరామస్వామీ, అస్మానీ ఏమయారో ఎవరికీ తెలియరాలేదు. వారిని వెతికించటానికి మానసింహ మహారాజే గాక, ఉస్మాన్, ఖ్వాజా ఈసాలు కూడా ఎంతో ప్రయత్నించి విఫలులయారు.

చివరకు మానసింహ మహారాజు మందారణ దుర్గంలో విశ్వాసపాత్రు డైన తన మనిషి నొకణ్ణి ఉంచి, విమలా తిలోత్తమల జాడ తెలియగానే వారికి మందారణ అప్పగించి రావలసిందని చెప్పి తన సైనిక శిబిరాన్ని ఎత్తివేసే పని ప్రారంభించాడు.

సేన రేపు ప్రయాణమై పోతుందనగా జగతసింహుడు బూరుగుచెట్ల తోపులో తన గుర్రం మెడలో లభించిన ఉత్తరాన్ని తీసి చదివాడు. అందులో ఇలా ఉంది:

"ధర్మం పాటించి అయినా సరే, బ్రాహ్మణ శాపానికి వెరిచి అయినా సరే



ఈ ఉత్తరాన్ని చూడగానే తిరిగి ఇక్కడికే రా! నే నొక బ్రాహ్మణ్ణి."

ఈ ఉత్తరాన్ని చూసి జగతసింహుడు, ఆశ్చర్యపడ్డాడు. తరవాత శత్రువుల పన్నాగమా అని శంకించి, చివరకు ఆ పాడుపడిన కోటకు వెళ్ళాలనే నిశ్చయించుకున్నాడు. అతను తన మనుషులతో, "నేను సమయానికి తిరిగి రాకపోతే నా కోసం ఆగకుండా బయలుదేరి నడవండి. నేను మిమ్మల్ని దారిలో కలుసుకుంటాను," అని చెప్పాడు.

అతను తిరిగి ఆ పాడుపడిన కోటకు చేరేసరికి అక్కడ గోరీ, చితీ అలాగే ఉన్నాయి. అయితే చితి పైన ఒక బ్రాహ్మణుడు కూర్చుని దుఃఖిస్తున్నాడు.

"నన్ను ఇక్కడికి రమ్మన్నది మీరేనా?" అని జగతసింహుడు అడిగే సరికి ఆ బ్రాహ్మణుడు తల ఎత్తి చూశాడు. జగతసింహుడు అభిరామస్వామిని గుర్తించి; "మీ రెందుకిక్కడ కూర్చున్నారు? దుఃఖిస్తున్నా రెందుకు?" అని అడిగాడు.

"నిన్నెందుకు రమ్మన్నానో అందుకే దుఃఖిస్తున్నాను. తిలోత్తమ చచ్చిపోతున్నది," అన్నాడు అభిరామస్వామి.

జగతసింహుడు కళ్ళ ముందు ఒక్కసారిగా అనేక దృశ్యాలు మెదిలాయి. తాను




ఆమెను మొట్టమొదట శైలేశ్వరాలయంలో చూసినది మొదలుకొని, తాను కారాగారంలో ఆమెతో క్రూరంగా మాట్లాడినదాకా జరిగిన సంఘటన లన్నీ జ్ఞాపకం వచ్చి అతని హృదయంలో ప్రేమ పొంగి పొర్లసాగింది.

"విమల నవాబును చంపినాక నేను నా కూతురినీ, మనమరాలినీ వెంటబెట్టుకుని తిరుగుతూ, మారువేషాలతో అజ్ఞాతంగా మసులుతూ నానా అవస్థలూ పడ్డాను. అదే తిలోత్తమ వ్యాధికి ఆరంభం కూడా. ఆమె రోగానికి కారణం నీకు తెలిసే ఉంటుంది. నాకు చాలా ఔషధాలు తెలుసు, కాని ఈ వ్యాధి మందులతో పోయేది కాదు.





అభిరామస్వామి అతనితో, "ఒక్క సారిగా నువ్వామె ఎదట పడటం మరింత ప్రమాదం. నువు వచ్చావని ఆమెకు ముందుగా చెప్పి నీకు కబురు చేస్తాను. అప్పుడు నువు రా," అన్నాడు. ఆయన పాడుపడిన కోట లోపలికి వెళ్ళి కొంచెం సేపట్లో తిరిగి వచ్చి, అతన్ని రమ్మన్నాడు.

లోపల ఒక గదిలో మంచం మీద తిలోత్తమ కళ్ళు మూసుకుని పడుకుని ఉంది. విమల వితంతువు వేషంలో పక్కన కూర్చుని ఆమె శరీరాన్ని రాస్తున్నది.

జగతసింహుడు తిలోత్తమ మంచం దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు.

"తిలోత్తమా, జగతసింహుడు వచ్చాడు," అని గట్టిగా కేకపెట్టాడు అభిరామస్వామి. తిలోత్తమ కళ్ళువిప్పి జగతసింహుణ్ణి కొంత సేపు చూసి దృష్టి మరల్చేసుకున్నది. ఆమె కళ్ళవెంట అశ్రుధారలు వెలువడ్డాయి. వాటిని చూస్తూ ఉద్రేకం చెంది జగతసింహుడు తిలోత్తమ కాళ్ళ దగ్గిర కూర్చుని తన కన్నీటితో ఆమెను తడపసాగాడు...

రోజులు గడిచిపోయాయి. అహోరాత్రాలు జగతసింహుడు తిలోత్తమ మంచం దగ్గిరే ఉండి ఆమెకు సమస్తోపచారాలూ చేస్తున్నాడు. సేన ఏమయిందో, శిబిరం

అయిదు రోజులుగా ఇక్కడే ఉంటున్నాను. ఒకనాడు నువ్విక్కడికి తలవని తలంపుగా రావటం చూసి, నీ గుర్రం మెడలో చీటీ కట్టాను. తిలోత్తమకు ప్రాణాపాయం కలిగే పక్షంలో నిన్నూ ఆమెనూ చివరి సారి సమావేశ పరచాలని అనుకున్నాను. అప్పటికింకా ఆమె పరిస్థితి నిరాశాకరంగా లేదు. అందుకని నీకు రెండు రోజులు గడువు పెట్టాను. ఇక తిలోత్తమ జీవించే ఆశ లేదు. ఆమె జీవన దీపం ఆరటానికి సిద్ధంగా ఉంది," అంటూ అభిరామస్వామి ఏడవసాగాడు. ఆయనతో బాటు జగతసింహుడు కూడా దుఃఖించాడు.



ఎత్తేసి అందరూ పాట్నా చేరారా, తన కోసం ఎవరన్నా ఎదురు చూస్తున్నారా, ఇవేవీ అతనికి పట్టలేదు; ఎండిపోయిన ఒక సుకుమారమైన లతను అతను తన అశ్రు ధారలతో తడిపి తిరిగి చిగిర్చేలాగా చేస్తు న్నాడు. తిలోత్తమకు కలిగిన వ్యాధికి ఈ ప్రేమ తప్ప మరొక ఔషధం లేదు. ఆమె క్రమంగా తన ఆరోగ్యాన్ని తిరిగి పొందసాగింది.

తిలోత్తమ మంచం మీద లేచి కూర్చో గలుగుతున్నది. విమల లేని సమయంలో ప్రేమికు లిద్దరూ ఆప్యాయంగా మాట్లాడు కుని, ఒకరి సంగతు లొకరికి చెప్పుకు న్నారు. క్షమాపణలూ పశ్చాత్తాప ప్రకట నలూ జరిగాయి.

ఒక రోజు సాయంకాలం అభిరామ స్వామి ఒక గదిలో కూర్చుని పుస్తకం చదువుకుంటూండగా జగతసింహు డక్కడికి వచ్చాడు. "మహాశయా, తిలోత్తమ కిప్పుడు ప్రయాణం చేసే శక్తి ఉన్నది. ఇంకా ఈ పాడుపడిన చోట ఉండటం దేనికి?" అన్నా డతను. అభిరామస్వామి పుస్తకం మూసి అవతల పారేసి, పరమానందంతో జగతసింహుణ్ణి కౌగిలించుకున్నాడు.

త్వరలోనే అభిరామస్వామి మందారణ దుర్గానికి వెళ్ళి తన మనమరాలిని జగత





సింహుడి కిచ్చి అత్యంత వైభవంగానూ, ఆడంబరంగానూ పెళ్ళి చేయించాడు.

పెళ్ళికి జగతసింహుడు జహానాబాద్ నుంచి తన బంధు మిత్రుల నందరినీ పిలిపించాడు. తిలోత్తమ బంధువులు కూడా అనేకమంది వచ్చి వివాహ మహోత్సవంలో పాల్గొన్నారు.

అయుషా తనను పెళ్ళికి ఆహ్వానించమని జగతసింహుణ్ణి అదివరకే కోరి ఉన్నది. అతను ఆ ప్రకారమే ఆమెకు కబురు చేశాడు. ఆమె తన తమ్ముణ్ణీ, మరి కొందరినీ వెంటబెట్టుకుని వచ్చి, అంతఃపురంలోనే బస చేసింది. ఆమె ఈ వివాహం



చూసి ఎంత బాధపడిందో తెలియదు, కాని పైకి చాలా ఆనందంగా ఉన్నట్టే కనబడింది, అందరికీ సంతోషం చేకూర్చింది.

వివాహం పూర్తి అయాక అయుషా వెళ్ళిపోతూ విమల వద్ద సెలవు తీసుకునేటప్పుడు, "నవాబునందినీ, నీ పెళ్ళికి నన్ను ఆహ్వానిస్తావా ?" అని విమల అడిగింది. ఆమెకు అయుషా ప్రేమ సంగతి ఏమీ తెలియదు.

అయుషా ఆమె కేమీ సమాధానం చెప్పక తిలోత్తమ వద్దకు వెళ్ళి, ఆమె చేతులు పట్టుకుని, "చెల్లీ, నేను వెళ్ళిపోతున్నాను. మీరు అక్షయసుఖాలతో రోజులు గడపాలనీ, సమస్త సౌఖ్యాలూ అనుభవించాలనీ మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను," అన్నది.

"అక్కా, తిరిగి నీ దర్శనం ఎప్పుడు ?" అని తిలోత్తమ అడిగింది.

"మళ్ళీ మనం ఎప్పుడు కలుసుకుంటామో నమ్మకంగా చెప్పలేను. మనం తిరిగి కలుసుకున్నా, కలుసుకోక పోయినా నీవు మటుకు అయుషాను మరిచిపోవద్దు," అన్నది అయుషా.

"మరిచిపోతే యువరాజు నన్ను క్షమిస్తాడా ?" అన్నది తిలోత్తమ నవ్వుతూ.



"ఈమాట నాకు కొంచెం కూడా నచ్చ లేదు. రాజకుమారుడి దగ్గిర నా ప్రస్తావన ఎన్నడూ తేవద్దు. తేనని మాట ఇయ్యి," అన్నది అయుషా. తనని గురించి ఆలోచించి నప్పుడు జగతసింహుడుడికి తప్పక బాధ కలుగుతుం దనుకునే ఆమె అలా అన్నది.

తిలోత్తమ ఆమె కోరిన దానికి సమ్మతించింది.

"కాని నువు నన్ను మరిచిపోగూడదు. నా జ్ఞాపకార్థం నే నిచ్చే వస్తువులను నీ వద్ద ఎల్లప్పుడూ ఉంచుకో," అని అయుషా దాసీని పిలిచి, ఒక దంతం పెట్టె తెప్పించింది. దాని నిండా రత్నాభరణా లున్నాయి. అయుషా స్వయంగా వాటిని తిలోత్తమకు పెట్టింది. తిలోత్తమ కూడా ధనికుల ఇంటి ఆడబడుచే గాని అలా మెరిసే రత్నాలనూ, అంత పనితనం గల నగకట్టునూ ఆమె ఎన్నడూ చూసి ఉండకపోవటం చేత అత్యాశ్చర్యం చెందింది. నిజానికి ఆ ఆభరణాలన్నీ అయుషాకు ఆమె తండ్రి ఇచ్చినవి. ఆమె వాటి నన్నిటినీ మార్పించి చేయించి, తిలోత్తమ కిచ్చే ఉద్దేశంతో దాచి ఉంచింది.

తిలోత్తమ వాటిని మరీ మరీ పొగడుతూండటం చూసి అయుషా, "చెల్లీ, వీటిని ఎందు కంతగా మెచ్చుకుంటావు? నీ హృద



యంలో ఉండే రత్నాభరణం ముందు ఇవి ధూళితో సమానం గద!" అన్నది. అంటూనే ఆమె కళ్ళ వెంట అశ్రువులు కార్చి కళ్ళు తుడుచుకున్నది.

ఆమె దుఃఖానికి కారణ మేమిటో తిలోత్తమకు తెలియలేదు.

అలంకరణ పూర్తి చేసి అయుషా తిలోత్తమ చేతులు రెండూ పట్టుకుని ఆమె ముఖాన్ని తిలకిస్తూ, "ఈ ముగ్ధ సుందరి ముఖం చూసి నా ప్రాణేశ్వరుడికి మనఃక్లేశం ఎన్నటికీ కలగబోదు," అనుకున్నది. ఆమె తిలోత్తమతో, "చెల్లీ ఇక నేను వెళ్ళి వస్తాను. నీ భర్తకు చెప్పి ఆయన పని

పాడుచెయ్యటం నా కిష్టం లేదు. దేవుడి దయవల్ల మీరు పది కాలాలపాటు సుఖంగా ఉండాలి! నే నిచ్చిన అలంకారాలను ఎల్లప్పుడూ ధరిస్తూ ఉండు. నన్ను మాత్రం మరిచిపోకు. నీ హృదయరత్నాన్ని నిర్మలంగా ఉంచుకో!" అన్నది.

ఆమె కంఠం గద్గదం కావటమూ, ఆమె కళ్ళ నిండా నీరు నిండటమూ తిలోత్తమ గమనించింది; "అక్కా, నువు దుఃఖిస్తున్నావెందుకూ?" అంటూ తాను కూడా ఏడుపు గొంతు పెట్టింది.

ఈ మాటతో అయుషా కళ్ళవెంట కన్నీరు ధారగా కారసాగింది. ఆమె అక్కడ ఒక్క క్షణం కూడా వుండలేక గబగబా వెళ్ళి తన పల్లకీలో ఎక్కేసింది.

అయుషా తన ఇంటికి చేరే సరికి రాత్రి ఇంకెంతో లేదు. ఆమె తన దుస్తులు విప్పేసి మామూలు వస్త్రాలు ధరించి, చల్ల గాలి కోసం కిటికీ వద్దకు వెళ్ళి అక్కడ నిలబడింది. ఆకాశాన అనంతమైన నక్షత్రాలు ధగధగా ప్రకాశిస్తున్నాయి. దిగువన కోట చుట్టూ ఉన్న అగడ్తలో ఆకాశం ప్రతిబింబిస్తున్నది.

అయుషా కిటికీలో కూర్చుని ఏమి ఆలోచిస్తున్నదీ ఊహించటం కష్టం. ఆమె తన వేలి నుంచి ఒక ఉంగరం తీసింది. ఆ ఉంగరంలో విషం ఉన్నది. అది హాలాహలం లాటి విషం.

"ఈ విష రసాన్ని తాగితే నా తృష్ణ యావత్తూ ఒక్క క్షణంలో సమసిపోతుంది," అనుకున్న దామె; కాని మరు క్షణమే, "ఇందుకేనా భగవంతుడు నన్ను సృష్టించి ఈ ప్రపంచం లోకి పంపింది? ఈ కాస్త బాధనే సహించ లేకపోతే నా స్త్రీ జన్మ ఎంత నిరర్థకం? అదీగాక జగత సింహుడికి తెలిస్తే అత నేమనుకుంటాడు," అనుకుని అయుషా ఆ ఉంగరాన్ని అగడ్త లోకి గిరాటు వేసింది. —(అయిపోయింది)





## తనకుమాలినధర్మం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల నిజంగా అసాధారణమైనది. కాని, నీవు తనకుమాలినధర్మం తలపెట్టావేమో నని నా భయం. అలా చేసిన పక్షంలో వినీతమతి లాగే నీవు కుడా సమస్తమూ పోగొట్టుకోగలవు. శ్రమ తెలియకుండా నీకు వినీతమతి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకప్పుడు అహిచ్ఛత్రపురాన్ని ఏలే ఉదయతుంగు డనే రాజు వద్ద కమలమిత్రు డనే ప్రతీహారి ఉండేవాడు. వినీతమతి ఆ కమలమిత్రుడి కొడుకు. అతను సకల సద్గుణ సంపన్నుడు.

ఒకనాటి రాత్రి అతను పండువెన్నెలలో మేడ పైన పడుకుని ఉండగా, వెన్నెల

## బేతాళ కథలు



కాంతిలో అమిత అందంగా కనిపిస్తున్న చెట్ల లోకి వెళ్ళి వనవిహారం చెయ్యాలని బుద్ధిపుట్టింది. వెంటనే అతను తన విల్లు తీసుకుని వనంలో ప్రవేశించి నడవసాగాడు. అత నలా కొంత దూరం వెళ్ళే సరికి ఒక చెట్టు కింద కూర్చుని ఏడుస్తూ ఒక కన్య కనిపించింది.

"ఎవరమ్మాయీ నీవు? ఎందు కిలా దుఃఖిస్తున్నావు?" అని వినీతమతి అడిగాడు.

"అయ్యా, నేను గంధమాలి అనే నాగేంద్రుడి కుమార్తెను. నా పేరు విజయవతి. కాలజిహ్వు డనే యక్షుడు నా తండ్రిని యుద్ధంలో ఓడించి తనకు బానిసగా ఉంచుకున్నాడు. అది సహించలేక నేను గౌరిని పూజించి ప్రత్యక్షం చేసుకున్నాను. ఆ దేవి నా కొక దివ్యమైన కత్తినీ, ఒక తెల్లని గుర్రాన్నీ ప్రసాదించి, వీటిని నీ కివ్వ మనీ, వాటి సహాయంతో నీవు కాలజిహ్వుణ్ణి జయించి, నా తండ్రిని విడిపిస్తా వనీ, ఆ కత్తి సహాయంతోనే నీవు శత్రువులను జయించి రాజు వవుతావనీ అన్నది. ఈ సమయంలో నీవు వనం ప్రవేశించటం చూసి నిన్ను ఆకర్షించటానికే నేను గట్టిగా ఏడ్చాను. నీవు నా కీ సహాయం చేసిపెట్ట గలవా?" అన్న దామె.

వినీతమతి సరే నన్నాడు. విజయవతి ఎటో వెళ్ళి, మరుక్షణమే ఒక తెల్లని గుర్రాన్నీ, అపజయం లేని కత్తినీ తీసుకుని వచ్చింది. వినీతమతి కత్తి తీసుకుని, గుర్రం పైన ఎక్కి, విజయవతిని కూడా ఎక్కించుకుని, యక్షు డుంటున్న మానససరోవరానికి బయలుదేరాడు. ఆ గుర్రం రెప్పపాటులో వారిని మానససరోవరానికి చేర్చింది.

యక్షులు చక్రవాకపక్షుల రూపం ధరించి ఆ సరస్సులో విహరిస్తున్నారు. విజయవతి తండ్రి అయిన గంధమాలి వారికి ఊడిగం చేస్తున్నాడు. వినీతమతి కత్తి దూసి యక్షుల పైన పడ్డాడు. అప్పుడు కాల

జిహ్వుడు తన పక్షి రూపం విడిచిపెట్టి, భయంకరాకారంతో వినీతమతి పైన కలియబడ్డాడు. కాని వినీతమతి ఆ యక్షుడి జుట్టు పట్టుకుని తల నరకబోయే సరికి అతను దీనంగా ఏడుస్తూ ప్రాణ భిక్ష వేడాడు. గంధమాలికి దాస్యం తప్పింది. అతను తన కుమార్తెను వినీతమతికి ఇచ్చి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

వినీతమతి ఖడ్గ అశ్వాలతో బాటు కన్యను కూడా సంపాదించుకుని ఇంటికి తిరిగి వచ్చి ఆమెను పెళ్ళాడాడు. అతని తండ్రి అయిన కమలమిత్రుడూ, రాజైన ఉదయతుంగుడూ కూడా చాలా సంతోషించారు.

ఉదయతుంగుడికి ఉదయవతి అనే కూమార్తె ఉన్నది. ఆమె అన్ని విద్యల లోనూ ఉత్తీర్ణురాలు. ఆమెను వాదంలో ఓడించిన క్షత్రియుడికి గాని, బ్రాహ్మణుడికి గాని తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తా నని రాజు ప్రకటించి ఉన్నాడు. ఉదయవతిని వాదంలో ఓడించి ఆమెను పెళ్ళాడ మని వినీతమతిని అతని తండ్రి పురికొల్పాడు. ఆమెతో ఎందరో వాదించి ఓడిపోయారు. అయినప్పటికీ ఆడదాన్ని వాదంలో ఓడించట మనేది వినీతమతికి కొంచెం అన్యాయ మనిపించింది, కాని తండ్రి మాట కాదన లేక సరే నన్నాడు.







కొంత కాలం గడిచింది. ఉదయతుంగుడు వృద్ధుడై రాచకార్యాలు నిర్వహించ లేని స్థితిలో పడ్డాడు. ఆయనకు కొడుకులు లేక పోవటం చేత అల్లుడికి పట్టం గట్టి, ముక్తి కోసం గంగా తీరానికి వెళ్ళిపోయాడు. వినీతమతి రాజ్యం ఏలుతూ తన ఇద్దరు భార్యల తోనూ సుఖంగా ఉన్నాడు.

ఇంతలో ఒకనాడు ఇందుకలశు డనే రాజకుమారుడు ఉత్తర దేశం నుంచి వినీత మతిని చూడ వచ్చాడు. వినీతమతి అతనికి యథోచితంగా అతిథి మర్యాదలు జరిపి, అతను వచ్చిన పని ఏమిటని అడిగాడు.

"దేవా, నీవు కల్పవృక్షం లాటి వాడవనీ, ఎవ రేది అడిగినా తప్పక ఇస్తావనీ విన్నాను. నేను నా తండ్రి దైన రాజ్యాన్ని ఏలు కుంటూండగా నా తమ్ముడు కనకకలశుడు పెద్ద బలంతో నా పైకి వచ్చి, నన్ను నా రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, నా రాజ్యాన్ని అపహరించి అనుభవిస్తున్నాడు. నీ వద్ద ఉండే అశ్వమూ, ఖడ్గమూ నా కిచ్చి నట్టయితే వాటి సహాయంతో నా తమ్ముణ్ణి ఓడించి నా రాజ్యాన్ని నేను తిరిగి పొంద గలను," అన్నాడు ఇందుకలశుడు.

వినీతమతి సంకోచించ కుండా వెంటనే ఇందుకలశుడికి తన గుర్రాన్నీ, ఖడ్గాన్నీ

వెంటనే కమలమిత్రుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, నా కొడుకు మన అమ్మాయిగారితో వాదన చేస్తానంటు న్నాడు. రేపు వాదన ఏర్పాటు చెయ్యండి," అన్నాడు. రాజు సరే నన్నాడు.

మర్నాడు విద్వత్సభ ఏర్పాటయింది. వినీతమతి రాజకుమార్తె చేసిన ప్రతి సిద్ధాం తాన్నీ ఖండించాడు. చివర కామె ఏమీ చెప్పలేకపోయింది. సదస్యులు వినీతమతిని తెగ మెచ్చుకున్నారు. ఉదయవతి ఓడిపోయి భర్తను సంపాదించుకున్నది. ఉదయతుం గుడు వినీతమతికి తన కుమార్తె నిచ్చి వైభవంగా పెళ్ళి చేశాడు.



ఇచ్చేశాడు. ఇందుకలశుడు వాటి సహా యంతో కనకకలశుణ్ణి జయించి, తన రాజ్యాన్ని తాను తిరిగి గెలుచుకున్నాడు. అన్న చేతిలో ఓడిపోయిన కనకకలశుడు ఏడుస్తూ అహిచ్ఛత్రపురానికి వచ్చి, వినీత మతి భవనాని కెదురుగా చితి పేర్చు కుని, అందులో పడి కాలిపోవటానికి సిద్ధమయాడు.

అప్పుడు వినీతమతి కనకకలశుడి వద్దకు వెళ్ళి, "నాయనా, ఎందుకు ఆత్మహత్య చేసుకుంటావు? నీకు కావలిసింది రాజ్యమే గద? నా రాజ్యం తీసుకో, నాకైనా సంతానం లేదు. నీవే నా కొడుకు వనుకుంటాను," అని, ఆ కనకకలశుడికి రాజ్యాభిషేకం చేసి, తన ఇద్దరు భార్యలనూ వెంటబెట్టుకుని వనవాసం వెళ్ళిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహా లున్నాయి. వినీతమతి ప్రవ ర్తనకు అర్థ మేమిటి? తాను రాజై ఉండి, రాజ్యరక్షణకు ఎంతో సహాయపడే కత్తినీ, గుర్రాన్నీ ముక్కూ ముఖమూ తెలియని ఇందుకలశుడి కెందు కిచ్చాడు? సాటి రాజును ఆదుకుందామని ఇచ్చాడే అను కుందాం. అలా అయితే ఇందుకలశుడి చేతిలో ఓడిపోయిన కనకకలశుడి పైన సానుభూతి చూపి, తన రాజ్యమే అతని



కివ్వటంలో అర్థ మేమిటి? అన్నను జయించి రాజ్యం గెలుచుకున్న కనకకలశుడు అన్న చేతిలో ఓడిపోయినప్పుడు ఓటమి ఒప్పుకోక, వినీతమతి కెదురుగా వచ్చి చితి పేర్చుకుని చావబోవటంలో అతని ఉద్దేశ మేమిటి? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వినీతమతి ప్రవర్తనకు పూర్తిగా అర్థం ఉన్నది. అతనిలో రాజ్యకాంక్ష ఏనాడూ లేదు. ఏ ఉద్దేశంతో విజయవతి అతనికి ఖడ్గాశ్వాల నిచ్చిందో, ఆ ఉద్దేశం నెరవేర్చటానికి మాత్రమే వాటిని ఉపయోగించాడు. రాజుకు వేరే సంతానం లేదనీ, రాజకుమార్తెను తాను వాదంలో తేలికగా ఓడించగలననీ తెలిసి కూడా అతను తండ్రి ప్రేరేపించిన దాకా రాజకుమార్తెతో వాదానికి పూనుకో లేదు. ఒకసారి రాజైనాక కూడా అతను తన ఖడ్గాశ్వాలతో ఇతర రాజ్యాలను జయించటానికి ఎలాటి యత్నమూ చేయ లేదు. వీటన్నిటిని బట్టి వినీతమతికి ఏ కోశానా రాజ్యకాంక్ష లేదని స్పష్టమవు తుంది. అటువంటి సందర్భంలో ఇందుకల శుడు ఖడ్గాశ్వాల నడిగితే ఇచ్చేశాడు. అన్నకు ఓడిపోయిన కనకకలశుడు తన ఓటమికి వినీతమతి కారకు డనుకోవటంలో తప్పేమీ లేదు. వినీతమతి తనను ఓడించి రాజ్యం కాజేస్తే కనకకలశుడు బాధపడేవాడు కాడు. దుర్బలుడైన తన అన్న మరొకరి సహాయంతో తనను గెలవటం కనకకలశుడు సహించలేక పోయాడు. తన కారణంగా ఆత్మహత్య చేసుకుంటున్న కనకకలశుడి రాజ్యకాంక్ష తీర్చటానికి వినీతమతి తన రాజ్యాన్నే అతని కిచ్చాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






జగత్సేను డనే రాజుకు ధనంజయు డనే కుమారు డుండేవాడు. అతను సకల విద్యల లోనూ ఉత్తీర్ణుడై, విలువిద్యలో ప్రత్యేకమైన ప్రావీణ్యం సంపాదించాడు. అతనికి యుక్తవయసు రాగానే తండ్రి యువరాజ్యాభిషేకం చేయ తలపెట్టి అందుకు ప్రయత్నాలు సాగించాడు. కాని ధనంజయుడికి మరికొంత కాలం స్వేచ్ఛగా గడపాలనీ, ప్రపంచం నాలుగు మూలలూ చూడాలనీ కోరిక పుట్టింది. అయితే తాను దేశ సంచారం పోతానంటే తల్లిదండ్రులు ఒప్పుకోరు, ఎందుకంటే అతను వారికి లేక లేక పుట్టిన కొడుకు.

అందుచేత ధనంజయుడు తన తండ్రికి గాని, తల్లికి గాని తెలియకుండా ఇల్లు విడిచి దేశాటన మీద బయలుదేరాడు. రాజు తన కొడుకు కోసం ఎంతగానో వెతికించాడు, కాని ప్రయోజనం లేకపోయింది. రాజుగారు దిగులు పడిపోయాడు. రాణి తన కొడుకు కోసం అనేక మాసాల పాటు కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచి, కళ్ళు పోగొట్టుకున్నది. ధనంజయుడు చచ్చిపోయి నట్టే అందరూ భావించారు. అతని కోసం యిక వెతికించి లాభం లేదనుకున్నారు.

కొంత కాలం గడిచింది. పుత్రశోకంతో అదే పనిగా కుములుతూ, కళ్ళు కూడా పోగొట్టుకున్న భార్యతో విసుగెత్తి రాజు ఆమెను వదిలేసి, మరొక భార్యను చేసుకున్నాడు. ఆయన పెద్ద భార్యకు దూరాన అరణ్య ప్రాంతంలో ఒక మేడ కట్టించి, అక్కడే ఆమెకు అవసరమైన వసతు లన్నీ ఏర్పాటు చేశాడు. కాలక్రమాన చిన్నరాణి ఒక కొడుకును కన్నది. వాడి అచ్చట్లూ, ముచ్చట్లూ చూసుకుంటూ రాజు తన పెద్ద కొడుకునూ, పెద్ద భార్యనూ పూర్తిగా మరిచిపోయాడు.

టి. రామచంద్రరావు



చిన్నరాణి కొడుకు అయిదేళ్ళ వాడై ఉండగా ధనంజయుడు తిరిగి వచ్చాడు. దేశాటన చేస్తూ అతను అనేక విజయాలు సాధించి, అంతులేని ధనమూ, పరివారమూ వెంటబెట్టుకుని స్వదేశానికి చేరుకున్నాడు. అత నింకా తన తండ్రి కోటను సమీపిం చక ముందే, ఎవరో మహావీరుడు పెద్ద సైన్యంతో కోట పైకి వస్తున్నా డన్న వార్త రాజుకు చేరింది.

ఈ వార్త చేరవేసినవాళ్ళు ఒకప్పుడు యువరాజును బాగా ఎరిగినవాళ్ళేగాని, అతను పూర్తిగా మారిపోయి ఉండటం చేత గుర్తు పట్టలేకపోయారు.

ఎవరో తన పైకి దండెత్తి వస్తున్నా రని భయపడి రాజు తన మంత్రిని సపరివారంగా ధనంజయుడి వద్దకు పంపాడు. మంత్రి కూడా ధనంజయుణ్ణి గుర్తుపట్టక, "మహా రాజా, తమ రెవరో తెలియదు. మాతో యుద్ధం చెయ్యకుండా తమ దారిన తాము వెళ్ళిపోయిన పక్షంలో దారి ఖర్చుకు మా రాజుగారు రెండువేల వరహా లిచ్చు కుంటారు," అన్నాడు.

ధనంజయుడు నవ్వి, "నా దారి కోట లోకే. నే నీ దేశపు యువరాజును. మహా మంత్రీ, నన్ను మీరు కూడా గుర్తించ లేదా?" అని అడిగాడు.

మంత్రి పరమానందం చెంది, అతనితో ఈ మధ్య కాలంలో జరిగిన దంతా చెప్పి, "ఇప్పుడు నీ తల్లి గుడ్డిదై గోరింట అడవిలో ఆరుకోసుల దూరాన ఉంటున్నది. రాజు గారి కిప్పుడు మరొక యువరాజు పెరిగి వస్తున్నాడు," అని చెప్పాడు.

ధనంజయు డీ వార్త విన్నాక కోట ప్రవే శించక తన పరివారంతో సహా తల్లి ఉంటున్న మేడకే వెళ్ళాడు. కొడుకు కంఠం వింటూనే అతని తల్లి కంట జలజలా ఆనం దాశ్రువులు రాలి, ఆమెకు పోయిన దృష్టి తిరిగి వచ్చింది.



ఈ లోపల మంత్రి రాజు వద్దకు తిరిగి వెళ్ళి ధనంజయుడు వచ్చాడనీ, అతను అంతఃపురానికి రాక తల్లి ఉండే వనానికే వెళ్ళాడనీ చెప్పాడు. రాజు తన పెద్ద కొడుకును తన వద్దకు రమ్మని ఆహ్వానం పంపాడు. తన తల్లి అరణ్యంలో ఉండగా తాను రాజభవనంలో ఉండటం జరగదని ధనంజయుడు జవాబు పంపాడు. అలా అయితే నీ తల్లితో సహా రమ్మన్నాడు తండ్రి. కాని ధనంజయుడి తల్లి ఇంతకాలమయాక తన భర్త దగ్గిరికి తిరిగి వెళ్ళ నిరాకరించింది.

ధనంజయుడికి తండ్రి నొకసారి చూడాలని ఉన్నది. తండ్రి కూడా తన కోసం తపించిపోతున్నాడని అతను విన్నాడు. అందుచేత అతను ఒక్కసారి రాజసభకు వెళ్ళివస్తానని తల్లితో చెప్పి, గుర్రం మీద రాజధానికి వెళ్ళాడు. అతను వస్తున్నట్టు తెలిసి పురప్రజలు గుంపులు గుంపులుగా రాజవీధి వెంబడి నిలబడి అతన్ని చూశారు. అతను రాజసభకు వెళ్ళగానే సభికులందరూ హర్షధ్వానాలు చేశారు. రాజు తన నెత్తి మీది కిరీటం కొడుకు నెత్తిన పెట్టి, "నాయనా, ఇక నుంచీ ఈ రాజ్యం నువే ఏలుకో," అన్నాడు.



ధనంజయుడు తన తండ్రితో కొంతసేపు రాచకార్యాలు ముచ్చటించి, తన మారుతల్లి నొక్కసారి చూసి పలకరిస్తానని బయలుదేరాడు. ఆమె ధనుంజయుడి తల్లి ఉండిన మేడ లోనే ఉన్నదని రాజు చెప్పాడు. ధనంజయుడా మేడకు వెళ్ళి లోపలికి పోతూండగా దారిలో రాజుగారి చిన్నకొడుకు విల్లుతోనూ, నాలుగు బాణాలతోనూ ఆడుకుంటూ కనిపించాడు.

"వీటితో ఎలా ఆడాలో నేను చూపిస్తాను చూడు, తమ్ముడూ," అంటూ ధనంజయుడు విల్లు ఎక్కుపెట్టి, నాలుగు బాణాలూ నాలుగు దిక్కులకు వేశాడు.





"నా బాణాలు నా కియ్యి," అంటూ కుర్రవాడు ఏడవసాగాడు.

కొడుకు ఏడుపు విని రాజు చిన్నభార్య వచ్చి, "ఏమిటి, నాయనా? ఎందు కేడుస్తున్నావు?" అని అడిగింది.

"ఈయ నెవరో వచ్చి నా బాణాలు పారేశాడు," అన్నాడు రాజు చిన్నకొడుకు.

"ఇక నీ గోడూ నా గోడూ వినేవా రెవరు?" అన్నది చిన్నరాణి.

ధనంజయుడు బాణాలు వదిలిన దిక్కుగా నౌకర్లు బయలుదేరి వెళ్ళారు. ఎంత దూరం వెళ్ళినా వారి కా బాణాల జాడ తెలియలేదు.

చిన్నరాణి అంతఃపురంలో అడావుడిగా ఉన్నట్టు రాజుకు తెలిసింది. ఆయన వచ్చి తన చిన్న భార్యను, "ఏమిటీ గొడవంతా?" అని అడిగాడు.

"ఆ అబ్బాయి వీడి బాణాలు పారేశా డట," అన్నది చిన్నరాణి.

"ఆ అబ్బాయి ఎవరో కాదు, యువ రాజు. ఆ బాణాలు కూడా వాడివే, నీ కొడుకువి కావు," అన్నాడు రాజు.

"అవును. మీరూ మీరూ ఒకటికా కేం జేస్తారు?" అని చిన్నరాణి దెప్పి పొడిచింది.

ధనంజయుడు తన తమ్ముణ్ణి బుజ్జగించి, "నీకు నేను మంచి బాణాలు చేయించి పెడతాను. ఏడవకు," అని చెప్పి, తన తమ్ముడికి బాణాలు చేసి ఇవ్వమని పని వాళ్ళకు చెప్పి, తండ్రి వద్ద సెలవు పుచ్చుకుని తల్లి మేడకు వెళ్ళిపోయాడు.

చచ్చిపోయా డనుకున్న ధనంజయుడు తిరిగి వచ్చేశాడు. దానితో చిన్నరాణికీ, ఆమె కొడుక్కూ పతనం సంప్రాప్త మయింది. ధనంజయుణ్ణి నిజంగానే చంపించా లనుకుని చిన్న రాణి రాజవైద్యులను పిలిపించి, "ఏ మందులోనో విషం పెట్టి మీరు ధనంజయుణ్ణి చంపేస్తే మీకు మంచి బహుమానం ఇస్తాను," అన్నది.

"రోగమూ రొష్టూ లేనివాడికి వైద్యం చెయ్యటం ఎవరితరం? తమరే రోగం అభినయించినట్టయితే తమ చికిత్స కోసం అతను బలి అయేటట్టు చూడవచ్చు," అన్నారు వైద్యులు.

వారి సలహా పై చిన్నరాణి దుర్భరమైన శిరోవేదన వచ్చినట్టు మూలుగుతూ పడు కున్నది. తన ప్రియమైన భార్య బాధ పడుతూ ఉండటం చూసి రాజు వైద్యులను పిలిపించాడు.

"మహారాజా, ఇది శిరోవాత సంబంధ మైన నొప్పి. అసలైన వజ్రాలు తెచ్చి పుటం పెట్టి ఔషధం తయారుచేసి ఇవ్వాలి. రత్నద్వీపం నుంచి తెచ్చిన వజ్రాలే కావాలి," అన్నారు వైద్యులు.

రత్నద్వీప ప్రయాణం ప్రమాదకరం. మంచి ధీరుడైన వాడు వెళ్ళాలి. వజ్రాలు రావటానికి ఒకటి రెండు మాసాలు పడు తుంది. అంత దాకా ఇతర ఔషధాలతో రాణిగారి తలనొప్పిని తగ్గించి ఉంచవచ్చు నన్నారు వైద్యులు.

రాజీ సమాచారం ధనంజయుడితో చెప్పి, "రత్నద్వీపానికి నువు బయలుదేరు తావా? నన్ను బయలుదేర మన్నావా?" అని అడిగాడు.



"పెద్దవారు, మీ కెందుకు శ్రమ? నేనే వెళతాను," అని ధనంజయుడు వెంటనే రత్నద్వీపానికి బయలుదేరాడు. రత్నద్వీపం దక్షిణ తీరానికి కొద్ది దూరంలో ఉన్నది. అక్కడ చిలుకరాజు రాజ్యం చేస్తున్నాడు.

ధనంజయుడు చిలుకరా జుండే నగరా నికి వెళ్ళి చూసేసరికి ధ్వజస్తంభానికి ఒక బాణం గుచ్చుకుని ఉన్నది. అది అతను తన దేశం నుంచి వేసిన బాణమే. ధనం జయుడు, "రావే బాణమా!" అనేసరికి బాణం ఊడి అతని చేతిలో పడింది.

అది చూసి అక్కడ ఉన్న రాజభటులు ధనంజయుణ్ణి రాజుగారి దగ్గరికి తీసుకుపో





యారు. రాజు అతని ఊరూ, పేరూ అడిగాడు. "మా దేశం ఇక్కడికి నూరామడలు ఉత్తరంగా ఉన్నది. నా పేరు ధనంజయుడు," అని ధనంజయుడు చెప్పాడు. బాణం మీద అతని పేరుండటం చూసి, నూరామడల దూరం బాణం వేసిన వాడికన్న తనకు మంచి అల్లుడు దొరకడని నిశ్చయించి, చిలుకరాజు అతనికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేశాడు.

పెళ్ళి అయిపోగానే ధనంజయుడు తాను వచ్చిన పని తన భార్యకు చెప్పాడు.

"వజ్రాలు ఇక్కడి కొండలలో ఉన్నాయి. అక్కడికి మనుష్యులు వెళ్ళటం ప్రమాదం. మా పెంపుడు చిలుకలను పంపి మీకు కావలిసి నన్ని వజ్రాలు తెప్పిస్తాను," అన్నది అతని భార్య.

చిలుకలు తెచ్చిన వజ్రాలతో అనేక సంచులు నిండాయి. ధనంజయుడు వాటినీ, తన భార్యనూ తీసుకుని తన దేశానికి తిరిగివచ్చాడు.

చిన్నరాణి ప్రయత్నం విఫలమయింది. కొద్ది రోజులు గడవనిచ్చి ఆమె మళ్ళీ తలనొప్పి వచ్చిందని మూలగ సాగింది. రాజు వైద్యులను పిలిపించి అడిగితే, "వజ్రభస్మంతో ఇది సమూలంగా నశించే శిరోవాతం కాదు. దీనికి రాక్షసిపట్టు తగిన మందు," అన్నారు వైద్యులు.

రాక్షసిపట్టు తూర్పున ఉన్న రాక్షసి దేశంలో దొరుకుతుంది. ధనంజయుడు అక్కడికి బయలుదేరాడు. అక్కడి రాజధానిలో ధ్వజస్తంభాని కొక బాణం గుచ్చుకుని ఉన్నది. ఆ బాణం తనదని చెప్పిన వాణ్ణి తన వద్దకు తీసుకు రమ్మని రాక్షసి రాజు చెప్పాడు.

ధనంజయుడు ధ్వజస్తంభం దగ్గిరికి వచ్చి పిలవగానే ఆ బాణం అతని చేతిలో పడింది. అదిచూసి రాజభటులు అతన్ని రాజు వద్దకు తీసుకువెళ్ళారు.





ధనంజయుడు నూరామడల దూరం నుంచి బాణం వేశాడని తెలిసి రాక్షసిరాజు అతనికి తన కూతురు నిచ్చి పెళ్ళి చేశాడు. పెళ్ళి కాగానే ధనంజయుడు తన భార్యతో తాను వచ్చిన పని చెప్పాడు.

"నేను రాక్షసులను పెంచుతున్నాను. జీవలంకలో అసలు రాక్షసు లున్నారు. నా పెంపుడు రాక్షసులను జీవలంకకు పంపితే వాళ్ళు కావలిసినంత పట్టు, రాక్షసులు నేసేది, తీసుకువస్తారు," అన్నది రాజు కూతురు.

ఈ విధంగా పది సంచుల రాక్షసిపట్టు తెప్పించి, ధనంజయుడు తన భార్యతో సహా కొందరు పెంపుడు రాక్షసులను కూడా వెంటబెట్టుకుని తన దేశానికి తిరిగి వచ్చాడు. ఆ రాక్షసులను చూస్తూనే చిన్న రాణి తన తలనొప్పి నయమయిం దన్నది. వైద్యులు రాక్షసిపట్టు కాల్చి దానితో మందు తయారుచేసి రాణి కిచ్చారు.

కొద్ది రోజులు గడిచాయి. చిన్న రాణి ధనంజయుణ్ణి చంపటానికి వైద్యులతో మరొక ఉపాయం ఆలోచించి, తిరిగి తల నొప్పి వచ్చినట్టు పడుకున్నది.

రాజు వైద్యులను పిలిపించి ఏం చేయాలని అడిగాడు.



"మహారాజా, రాక్షసిపట్టు వైద్యంతో కూడా పురుగు సాంతం చావలేదు. పెద్దపులి జున్నుపాలతో గాని ఈ వ్యాధి పోదు," అన్నారు వైద్యులు.

పెద్దపులులు ఉత్తరాన పులిరాజు రాజ్యంలో ఉంటాయి. అక్కడికి వెళ్ళి, ఈనిన పులులుగా చూసి, వాటి పాలు పిండుకు రావాలి. ఈ పనికి పూనుకుని ధనంజయుడు పులిరాజు పట్టణానికి బయలు దేరాడు. ఆ పట్టణం చేరే సరికి అక్కడి ధ్వజస్తంభానికి అతని బాణం గుచ్చుకుని ఉన్నది. అతను పిలవగానే ఆ బాణం వచ్చి అతని చేతిలో పడింది.





పులిరాజు అతన్ని పిలిపించి, అతని ఊరూ పేరూ అడిగి, బాణం మీద అతని పేరు గుర్తించి, తన కూతురిని అతని కిచ్చి పెళ్ళిచేశాడు. పెళ్ళి కాగానే ధనంజయుడు తన భార్యకు తాను వచ్చిన పని చెప్పాడు.

"నేను బోలెడన్ని పులులను పెంచుతున్నాను. అందులో చూడివీ, పాడివీ ఉన్నాయి. పాలు పితికి తీసుకుపోతే పని జరగదు. మన వెంటే ఒక యాభై పులులను పట్టుకుపోతే పని తీరిపోతుంది," అన్నది పులిరాజు కూతురు.

ధనంజయుడు సరేనని తన భార్యతో బాటు యాభై పెంపుడు పులులను కూడా వెంటబెట్టుకుని తన దేశానికి తిరిగి వచ్చాడు. ఆ పులులను చూసి జనం భయపడటం మాట అటుంచి చిన్నరాణికే ప్రాణం పోయినంత పని అయింది.

వైద్యు లామెకు పులిపాల జున్నుతో చికిత్స చేశామనీ, వ్యాధి తగ్గిపోయిందనీ రాజుకు చెప్పారు.

చిన్నరాణి వైద్యులను మళ్ళీ పిలిపించి, "ఈ ధనంజయుడు మృత్యుదేవత నోట్లో పెట్టినా బతికి వస్తున్నాడు. ఇప్ప డేం చెయ్యాలి? ఇతనికి అసాధ్యమైన పని ఏదైనా కల్పించండి. దాన్ని అతను చెయ్యలేకపోతే రాజుకు అతనిపై మనసు విరిగిపోతుంది," అన్నది.

"సరే, మీరు తలనొప్పి వచ్చిందని పడుకోండి. మేం రాజుగారితో చెప్పవలసినది చెబుతాం," అన్నారు వైద్యులు. చిన్నరాణి మళ్ళీ మూలుగుతూ పడుకున్నది.

అది చూసి రాజు వైద్యులను పిలిచి, "ఏమయ్యా, ఇన్ని ఘనచికిత్సలు చేసి కూడా మీరు రాణిగారి తలనొప్పి నయం చెయ్యలేక పొయ్యా రేమిటి? మీ వల్ల అవుతుందా, కాదా?" అని అడిగాడు.

"మహారాజా, దీనికి తిరుగు లేని చికిత్స ఒకటే ఉన్నది. అది సాధ్యపడ దేమో నని

ఇంతకాలం తమకు మనవి చెయ్యలేదు," అన్నారు వైద్యులు.

"చికిత్స ఏమిటో చెప్పండి. అది సాధ్యమో అసాధ్యమో నేను చూసుకుంటాను," అన్నాడు రాజు.

"కొత్తగా తవ్విన సరస్సులో రాణీగారు స్నానం చేస్తే, సమూలంగా శిరోవాతం పోతుంది. అయితే ఆ సరస్సు మన ఊరి మైదాన మంత ఉండాలి. దాని చుట్టూ ఎత్తయిన చెట్లుండాలి. చెరువు నిండా నీరుండాలి. అందులో చేప లుండాలి," అన్నారు వైద్యులు.

"చెరువు తవ్వించటానికే ఏడాది పడుతుంది. దాని చుట్టూ చెట్లు పెంచటానికి పదేళ్ళయినా పడుతుంది. ఈ చికిత్స ఎలా సాధ్యం?" అన్నాడు రాజు.

"చిత్తం, అదే మేమూ ఆలోచిస్తున్నాం. మేము ఇచ్చే ఉపశాంతి ఔషధాలు నెల పైన పనిచేయవు," అన్నారు వైద్యులు.

రాజుగారు దిగులు పడిపోయి, వైద్యులను పంపేసి, ధనంజయుణ్ణి పిలచి, సంగతంతా చెప్పి, "ఇందు కేదైనా ఉపాయం ఆలోచిస్తే నువే ఆలోచించాలి," అన్నాడు.

"నెల లోపుగా నేను ఏదో మార్గం కని పెట్టి తిరిగి వస్తాను," అని ధనంజయుడు



పడమరగా బయలుదేరాడు. కొత్తగా తవ్వుతున్న చెరువు ఎక్కడన్నా తగులుతుందేమో చూసి వద్దామని అతని ఉద్దేశం. మిగిలిన మూడు దిక్కులా నూరామడ దూరంలో తన కలాటి చెరు వేదీ కనిపించ లేదు. అందుచేత అతను నాలుగో దిక్కుగా బయలుదేరాడు.

వెళ్ళగా వెళ్ళగా అతనికి, కొత్తగా తవ్వుతున్న చెరు వేదీ కనిపించలేదు గాని, ఏనుగుల రాజుండే నగరం తగిలింది. అక్కడి ధ్వజస్తంభం మీద అతనికి తన నాలుగో బాణం కనిపించి, పిలవగానే చేతిలో పడింది.



ఏనుగులరాజు అతని ఊరూ పేరూ తెలుసుకుని తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు. పెళ్ళి కాగానే ధనంజయుడు తన భార్యతో తాను బయలుదేరిన పని ఏమిటో చెప్పాడు.

"అదెంత పని! నా వద్ద ఎన్నో పెంపుడు ఏనుగులున్నాయి. వాటి భాష నాకు తెలుసు, నా భాష వాటికి తెలుసు. ఏం చెయ్యాలో వాటికి చెప్పానంటే అవి అడవి ఏనుగులను కలుపుకుని వెళ్ళి మన ఊరిలోనే చెరువు తవ్వి, చేపలతో సహా నీరు నించి, చెరువు గట్ల మీద ఎత్తయిన చెట్లు నాటేస్తాయి. మీ పినతల్లి అందులో స్నానం చేసి చికిత్స పొందవచ్చు," అన్నది.

అంతా ఆమె చెప్పినట్టే జరిగింది. ధనంజయుడు తన భార్యతో తన దేశానికి తిరిగి వచ్చే సరికి వారి ఊరి మైదానం బ్రహ్మాండమైన చెరువుగా మారిపోయింది. దాని నిండా చేపలు ఈదుతున్నాయి. చెరువు చుట్టూ బ్రహ్మాండమైన అరణ్య వృక్షాలు నాటబడి ఉన్నాయి.

రాజు పరమానందభరితుడై వైద్యులతో, "రాణిగారిని స్నానం చేయించి చికిత్స చెయ్యండి. ఈ సారి ఆమె తలనొప్పి అంటే మిమ్మల్ని దండిస్తాను," అన్నాడు.

చిన్నరాణి స్నానం చెయ్యటానికి వచ్చి చెరువులో ఒక కాలు పెట్టి రెండో కాలు పెట్టగానే అడుగుకు వెళ్ళిపోయింది. ఏనుగులు తవ్విన ఆ చెరువు ఒడ్డు నుంచి కూడా పది నిలువుల లోతున్నది. అందులో పడిపోయిన రాణి ప్రాణంపోయి తేలిన దాకా ఎవరి కంటా పడలేదు.

తన ప్రియభార్య పోయినందుకు విచారిస్తున్న రాజుకు దాసీల వల్ల ఆమె చేసిన ద్రోహం తెలిసింది. రాజు వైద్యులను దేశం నుంచి వెళ్ళగొట్టి, తన పెద్ద భార్యను తెచ్చుకుని, ఇద్దరు కొడుకుల తోనూ సుఖంగా ఉన్నాడు.






ఉజ్జయినీ నగరంలో ఠింఠాకరాళు డనే ఒక విచిత్ర వ్యక్తి ఉండేవాడు. అతను రోజల్లా జూదా లాడించేవాడు. గెలిచిన వాళ్ళు అతనికి నూరేసి గవ్వ లిచ్చేవాళ్ళు. సాయంకాలం వేళ అతను ఆ డబ్బు తీసుకు పోయి బజారులో ఇంత గోధుమపిండి కొని, కుండపెంకులో కాసిని నీళ్ళు తెచ్చుకుని, దానితో పిండి కలిపి రొట్టెలు తయారు చేసే వాడు. తరవాత అతను ఆ రొట్టెలను తీసుకుని శ్మశానానికి వెళ్ళి, చితి మంటలలో వాటిని కాల్చుకుని, వాటిని తీసుకుని మహా కాళుడి ఆలయానికి వెళ్ళి, అక్కడి దీపా రాధన నెయ్యి తన రొట్టెలకు పూసుకుని తిని, ఆ దేవుడి గుడి ముందే నేలపైన పడు కుని నిద్రపొయ్యేవాడు.

ఒకనాటి రాత్రి ఠింఠాకరాళుడు గుడి ముందు పడుకుని ఉండగా, గుడి గోడ మీది మాతృకల బొమ్మలూ, యక్ష ప్రతిమలూ కదులుతున్నట్టు కనబడింది. వెంటనే అతని కొక ఆలోచన వచ్చింది: గుడి వద్ద ఉండే దేవతలను జూదం లోకి దింపితే లాభం కలగవచ్చు; ఒకవేళ లాభం రాక పోతే తాను పోగొట్టుకునేది ఏమీ లేదు.

ఈ ఆలోచన కలగగానే అతను, "ఓ దేవతలారా, నాతో జూద మాడండి. ఎప్పుడు గెలిచిన సొమ్ము అప్పుడు చెల్లించ వలిసిందే. అప్పుల బేరం లేదు," అన్నాడు.

దేవతలు జవాబు చెప్పలేదు. జూదగాళ్ళ కట్టుబాటేమిటంటే, అవతలివాడు పందెం కాచి, పాచికలు వెయ్యబోయే టప్పుడు తాము ఆటలోకి రామని చెప్పకపోతే వాళ్ళు ఆటలో ఉన్నట్టే, ఆటకు ఒప్పుకున్నట్టే. ఠింఠాకరాళుడు పందెం చెప్పి పాచికలు వేశాడు. దేవతలు వద్దని అతన్ని నివారించ లేదు. ఠింఠాకరాళుడు దేవతల నుంచి విస్తారంగా బంగారం గెలుచుకున్నాడు.



మాతృదేవతలకు పట్టుకున్నది. అది చూసి చాముండీదేవి వాళ్ళతో, "వాడు పందెం పెట్టి జూదానికి పిలిచినప్పుడు, మేం తప్పుకుంటున్నా మని చెబితే మీరు ఆటలో లేనట్టే. ఈ సారి వాడితో ఆ మాట చెప్పండి," అన్నది.

తింతాకరాళుడు వచ్చి జూదానికి రమ్మని పిలవగానే గుడి మీద ఉండే దేవత లందరూ, "మేం తప్పుకున్నాం," అనేశారు. దానితో అతని ఆట కట్టయింది. అతను తిన్నగా మహాకాళుడి వద్దకే వెళ్ళి, ఆ దేవుణ్ణి ఆటకు పిలిచాడు. "నేను తప్పుకున్నాను," అన్నాడు మహాకాళుడు కూడా.

వెంటనే తింతాకరాళుడు దేవుడి కాళ్ళు రెండూ పట్టుకుని, "స్వామీ, నా దురదృష్టం మూలాన నీవు కూడా లోభివైపోయావా? మూడు లోకాలూ భరించగలవు గాని, నా వంటి దరిద్రుణ్ణి భరించలేవా? నీతో మాట్లాడిన నేను మళ్ళీ జూదరులతో ఏమని మాట్లాడను? నన్ను నీవే ఎలాగైనా అనుగ్రహించాలి," అని ప్రాధేయపడ్డాడు.

"ఒరే, భయపడకు. నీకే లోటూ రాకుండా నేను చూస్తాను. నీ విక ఇక్కడే ఉండిపో," అన్నాడు మహాకాళుడు. తింతాకరాళుడు అక్కడే కాలం గడపసాగాడు.

చివర కతను, "నేను గెలిచిన బంగారమంతా నా కిచ్చెయ్యండి," అన్నాడు. దానికి క్కూడా దేవతలు జవా బివ్వలేదు. జూదంలో ఓడిపోయి, డబ్బివ్వక, మాట్లాడకుండా ఊరుకున్న వారిని రంపాలతో కొయ్యటం రివాజు. అందుచేత తింతాకరాళుడు దేవతలను కొయ్యటాని కొక రంపం పట్టుకొచ్చాడు. దాన్ని చూసి భయపడి దేవతలు అతనికి తాము ఓడిపోయిన ధన మంతా ఇచ్చారు.

అది మొదలు తింతాకరాళుడు ప్రతి రాత్రీ మాతృదేవతలతో జూద మాడి బంగారం గెలుచుకో సాగాడు. ఇది ఇలా ఎంత కాలం జరుగుతుందో నన్న దిగులు

ఒకనాటి రాత్రి భైరవుడు అతనితో, "ఒరే, ఈ సమయంలో కొందరు అప్సరలు మహా కాళీ తీర్థంలో స్నానాలు చేస్తున్నారు. వారు గట్టున పెట్టుకున్న బట్టలన్నీ చప్పున పట్టుకురా. వారిలో కళావతి అనే అప్సర ఉన్నది. అది నిన్ను పెళ్ళాడటానికి ఒప్పుకున్న దాకా వారి బట్టలు వారి కివ్వకు," అని సలహా ఇచ్చాడు.

తింతాకరాళుడు అలాగే చేశాడు. అతను కళావతిని తన కిస్తే గాని బట్ట లివ్వనంటే, మిగతా అప్సరలు సమ్మతించారు. ఎందు కంటే కళావతికి అదివరకే ఇంద్రుడి శాపం ఉన్నది. స్వర్గం చూసి ఆనందించటానికే తప్ప, భూలోకంలో ఉండే సుఖాలు అక్కడ లేవని కళావతి ఆక్షేపించింది. అది తెలిసి ఇంద్రుడు, "మానవుణ్ణి పెళ్ళాడి భూలోక సుఖాలు అనుభవించు," అని శపించాడు. ఆ శాపం ఇప్పుడు ఫలించింది. కళావతి తింతాకరాళుడికి భార్య అయింది. ఆమె పగలు దేవలోకానికి వెళ్ళి, రాత్రి కాగానే తన భర్త వద్దకు తిరిగి వస్తూండేది.

ఒకనాడు కళావతి తన భర్తతో, "రేపు రంభ ఇంద్రుడి ఎదట ఒక కొత్త నాట్యం చేస్తున్నది. అది ముగిసిన దాకా మే మంద రమూ అక్కడే ఉండాలి. అందుచేత నేను చాలా ఆలస్యంగా వస్తాను," అన్నది.





"ఆ నృత్యం నేను కూడా చూసి ఆనం దిస్తాను. నన్ను రహస్యంగా తీసుకుపో," అని ఠింఠాకరాళుడు అడిగాడు.

"అమ్మయ్యో, ఇంద్రుడికి తెలిస్తే ఇంకే మన్నా ఉందా?" అన్నది కళావతి. కాని ఠింఠాకరాళుడు ఆమెను బుజ్జగించి, ఎలాగో ఒప్పించాడు.

తెల్లవారగానే కళావతి స్వర్గానికి బయలు దేరుతూ తన భర్తను తన చెవిలో పెట్టు కున్న కలవపువ్వులో దాచి, వెంట తీసుకు పోయింది. ఠింఠాకరాళుడు తన భార్య సహాయంతో ఇంద్రభవనం ముందున్న ఐరా వతాన్నీ, పక్కనే ఉన్న నందనవనాన్నీ చూశాడు; ఇంద్రభవనం లోపల దేవతలతో కొలువుతీరి ఉన్న ఇంద్రుణ్ణి చూశాడు; అప్సరలు పాడుతూండగా రంభ చేసిన నృత్యాన్ని చూశాడు; నారదుడు మొదలైన వారి వాద్య సంగీతం విన్నాడు; తాను కూడా ఒక దేవత అయిపోయినట్టు సంతోషించాడు.

చిట్టచివరకు అక్కడ అతని కొక మేక నృత్యం చేస్తూండటం కనిపించింది. అది అతను రోజూ ఉజ్జయినిలో చూసే మేకే. ఆ మేక స్వర్గంలో ఎలా తటస్థపడినదీ అత నికి అర్థం కాలేదు. ఇందులో ఏదో మాయ ఉన్న దనుకున్నాడు. నిజాని కా మేక ఒక చిల్లర దేవత; గాలికి తిరిగేవాడు.

ఇంద్రుడి సభ ముగియగానే కళావతి తన భర్తను తిరిగి భూలోకంలో చేర్చింది. మర్నాడు ఉజ్జయినిలో ఆ మేక ఠింఠాకరా ళుడికి కనబడింది. అతను దాన్ని నిలవేసి, "ఒరే, గాలికి తిరిగేవాడా, నిన్న ఇంద్రుడి ఎదట చేసిన నృత్యం నా ఎదట కూడా చెయ్యి. లేకపోతే నిన్ను క్షమించేది లేదు," అన్నాడు.

మేకకు ఆశ్చర్యం వేసింది. "ఇదేమిటి? వీడికి నా సంగతి ఎలా తెలిసింది? వీడు మామూలు మనిషి గదా!" అనుకున్న దా మేక. అది తన కోరిక మన్నించి నృత్యం

చెయ్యకపోయేసరికి తింతాకరాళుడా మేకను దుడ్డుకర్రతో ముఖం పగిలేటట్టు కొట్టాడు. తల నుంచి రక్తం కారుతూ ఆ మేక ఇంద్రుడి వద్దకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పింది. ఇంద్రుడు దివ్యదృష్టితో జరిగినది గ్రహించి, కళావతిని పిలిచి, "నీవు మనుష్యమాత్రుణ్ణి స్వర్గానికి తెచ్చి నందుకు శిక్షగా, నాగపురంలో నరసింహ రాజు కట్టించే దేవాలయం మీది సాలభంజి కలో నివసించు," అని శపించాడు.

కళావతీ, కళావతి తల్లి అలంబుషా ఇంద్రుడి కాళ్ళ పైన పడి అనుగ్రహించ మని వేడుకున్నారు. ఇంద్రుడు కనికరించి, "ఆ ఆలయం నేలమట్ట మయినప్పుడు నీకు శాపవిముక్తి కలుగుతుంది," అని కళా వతితో చెప్పాడు.

ఆమె తన భర్త వద్దకు వచ్చి, తనకు ఇంద్రు డిచ్చిన శాపం గురించి చెప్పి, తన దివ్యాభరణా లన్నీ ఊడ్చి భర్త కిచ్చి, శాపం అనుభవించటానికి నాగపురం వెళ్ళి, అక్కడ గుడిలో మూలస్తంభానికి ఉన్న సాలభంజికలో ప్రవేశించింది.

తింతాకరాళుడు భార్యా వియోగంతో చాలా బాధపడ్డాడు. తాను బుద్ధిహీనుడై నోరు జారటం చేతనే తన భార్య శాపం పొందటం తలచుకుని తన్ను తాను తిట్టు



కున్నాడు; చిట్టచివరకు, విచారించి లాభం లేదనీ కళావతి శాపం సాధ్యమైనంత త్వరగా ముగిసే మార్గం చూడాలనీ నిశ్చయించుకున్నాడు.

అతను ముని వేషం వేసుకుని, నాగపురానికి వెళ్ళి, నగరం చుట్టూ ఉన్న అడవిలో నాలుగు దిక్కులా నాలుగు కలశాలలో కళావతి నగలు కొంచెం కొంచెంగా ఉంచి గుర్తుగా పాతిపెట్టి, రత్నాలతో నిండిన అయిదో కలశాన్ని అర్ధరాత్రి వేళ ఆలయం ముందు పాతిపెట్టాడు. ఆ తరవాత అతను నది ఒడ్డున చిన్న పర్ణశాల వేసుకుని, దొంగ తపస్సు ప్రారంభించాడు.

ఊళ్ళోవాళ్ళు ఈ దొంగ మునిని చూసి ఎవరో మహాతపస్వి అనుకున్నారు. అతని సంగతి రాజుగారి దాకా వెళ్ళింది. ఆయన అతన్ని పిలిపించాడు, కాని రింరాకరాళుడు వెళ్ళలేదు. అప్పుడు రాజు తానే బయలుదేరి దొంగ ముని ఉండే పర్ణశాలకు వచ్చాడు. సాయంకాలం దాకా ఇద్దరూ మాట్లాడుకున్నారు. రాజు ఇంటికి పోవటానికి బయలుదేరుతూండగా దూరాన అరణ్యంలో నుంచి ఒక నక్క కూసింది.

ఆ కూత వింటూనే దొంగముని నవ్వాడు. ఎందుకు నవ్వుతున్నావని రాజడిగితే, నీకు సంబంధించిన విషయం కాదులెమ్మ



న్నాడు. కాని రాజు నిర్బంధం చేసి అతని నవ్వుకు కారణ మడిగాడు.

"మరేమీ లేదు. తూర్పు పక్క అర ణ్యంలో రత్నాభరణాలు గల కలశం పాతి పెట్టి ఉన్నదిట, నన్ను తీసుకోమని నక్క హెచ్చరిస్తున్నది. నాకు నక్కభాష తెలుసునుగా!" అన్నాడు దొంగముని.

నక్కమాట నిజమో కాదో చూడాలని రాజుకు కుతూహలం కలిగింది. ఆయన దొంగ మునిని వెంటబెట్టుకుని వెళ్ళి, అతను చెప్పిన చోట తవ్వించే సరికి కలశం దొరికింది. అందు లోని నగ లన్నిటినీ ముని రాజు కిచ్చేశాడు.

తింతాకరాళుడు రాజుకు మిగిలిన దిక్కులలో తాను పాతిపెట్టిన కలశాలు కూడా ఇదే విధంగా దొరికేటట్టు చేశాడు. రాజే గాక, రాజభవనంలో ప్రతి ఒక్కరూ దొంగ మునికి దాసానుదాసు లయారు.

ఒకరోజు రాజు మునిని దేవాలయానికి ఆహ్వానించి వెంటబెట్టుకు పోయాడు. వాళ్ళు ఆలయం సమీపంలోకి వస్తుండగా ఒక కాకి అరిచింది.

దొంగముని రాజుతో, "ఈ ఆలయం ఎదురుగా వీధి లోనే రత్నాల కలశం పాతి పెట్టి ఉందనీ, తవ్వి తీసుకోమనీ ఈ కాకి చెబుతున్నది," అన్నాడు.



రాజు ఆ కలశాన్ని కూడా తవ్వి తీసుకుని పరమానంద భరితుడై, దొంగమునిని చెయ్యి పట్టుకుని, నడిపిస్తూ ఆలయంలో ప్రవేశించాడు. ఆ సమయంలో, సాల భంజికలో ఉన్న కళావతి, ముని రూపంలో ఉన్న తన భర్తను చూసి కన్నీరు కార్చసాగింది.

"స్వామీ, ఏమిటిది? శిల్ప ప్రతిమ కన్నీరు కారుస్తున్నది!" అని రాజు దొంగ మునిని అడిగాడు.

ఠింఠాకరాళుడు విచారమూ, కంగారూ పడుతున్నట్టు నటిస్తూ, "చెప్ప గూడని సంగతి. అయినా మీ ఇంటి వద్ద చెబుతాను. పోదాం పద," అని రాజు వెంట రాచనగరుకు వెళ్ళి, "రాజా, నీ వీ ఆలయాన్ని కట్ట రాని చోట, కట్ట గూడని ముహూర్తంలో కట్టించావు. అందుచేత ఆ రాతిబొమ్మ నిన్ను చూసి కన్నీరు కార్చింది. నీవు నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండదలిస్తే, ఈ దేవాలయాన్ని వెంటనే నేలమట్టం చేసి, మంచి చోట, మంచి ముహూర్తాన మరొక దేవాలయం కట్టించు. అందువల్ల నీకూ, ప్రజలకూ మేలు కలుగుతుంది," అని చెప్పాడు.

రాజు బెదిరిపోయి మర్నాటికల్లా దేవాలయం రూపు లేకుండా చేయించి, మరొక చోట ఇంకో దేవాలయం కట్టించాడు. తన పని తీరగానే ఠింఠాకరాళుడు సన్యాసి వేషం తీసేసి ఉజ్జయినికి పారిపోయాడు. శాపం తీరిన కళావతి ఉజ్జయినిలో తన భర్తకు కన బడి దేవేంద్రుణ్ణి చూడబోయింది. ఆమెను చూసి దేవేంద్రుడు ఆశ్చర్యపోయాడు. ఆమెకు శాపవిముక్తి కలగటానికి ఠింఠాకరాళుడు చేసిన యుక్తి విని ఇంద్రుడు విరగబడి నవ్వాడు. ఆయన కళావతి ద్వారా ఠింఠాకరాళుణ్ణి స్వర్గానికి పిలిపించి, అతని బుద్ధి ధైర్యాన్ని ప్రశంసించి, అతనికి కళావతి నిచ్చేసి, అతన్ని తన వెంట ఉండే పరివారంలో చేర్చుకున్నాడు.





# అపాత్ర దానం

పాపన్న ఎటువంటి కష్టంలో ఉన్న వాళ్ళ కయినా ప్రతిఫలాపేక్ష లేకుండా సహాయం చేస్తాడు; తెలిసిన వాళ్ళూ, తెలియనివాళ్ళూ అనే భేదం అతనికి లేదు; పరోపకారం చెయ్యట మంటేనే అతనికి ఎంతో ఆనందం. ఈ సంగతి చుట్టుపక్కల అనేక గ్రామాల వారికి తెలిసిపోయింది.

ఆ పల్లెలలో పేదపల్లె అనే ఒక గ్రామం ఉన్నది. అక్కడ ఉండే వాళ్ళందరూ పేద వాళ్ళు, కూలీ నాలీ చేసుకు బతికేవాళ్ళు. వారిలో సంగప్ప అనేవా డొక డుండేవాడు. వాడు పాపన్నను గురించి చాలా విని ఉన్నాడు. పాపన్న సహాయంతో, వాడు ఏ పనీ చెయ్యకుండా, ఇంటిపట్టున కూర్చుని, కొంత కాలం, సుఖపడదా మనుకున్నాడు.

అవి పొలాల నుంచి ధాన్యం ఇళ్లకు వచ్చే రోజులు. సంగప్ప ఒకనాడు పాపన్న ఇంటికి వచ్చి, "అయ్యా, నేను చాలా బీదవాణ్ణి. నా కూతురికి పెళ్ళి చెయ్యాలి. సంబంధ మైతే కుదిరింది గాని, పదిమందినీ పిలిచి భోజన మైనా పెట్టాలి గద. బియ్యం కొన టానికి కూడా నాకు శక్తి చాలదు. ఎంతో మందిని సహాయం అడిగాను. లాభం లేక పోయింది. మీ పేరు విని వచ్చాను. మీరు బియ్యం సహాయం చేశారంటే ఈ పెళ్ళి మీరే చేయించినవా రవుతారు. మీ ఉపకారం ఎన్నటికీ మరవను," అన్నాడు.

"సరయిన సమయానికి వచ్చావు. నా దగ్గర డబ్బయితే లేదు గాని, బియ్యం ఉన్నది. ఎంత కావాలో చెప్పు. నీ కూతురి పెళ్ళికి అన్నం ఖర్చు నాదే ననుకో," అన్నాడు పాపన్న.

"మా గ్రామంలో వాళ్ళందరినీ పిల వాలి. సుమారు మూడు వందల మందికి భోజనం పెట్టాలి. ఒక బస్తా అయితే సరిపో తుంది," అన్నాడు సంగప్ప.

పరోపకారి పాపన్న కథ

పాపన్న వాడి కొక బియ్యం బస్తా ఇచ్చాడు; మీనాక్షి కోసం కొత్తగా కొన్న చీర కూడా ఇస్తూ, "ఇది పెళ్ళికూతురికి నా కానుకగా తీసుకో," అన్నాడు.

సంగప్ప ఆ బియ్యంబస్తాను పాపన్న బండిలోనే వేసుకుని తన పల్లెకు వెళ్ళి, బియ్యంబస్తా తన ఇంట్లో పడేసి, బండిని తిరిగి పాపన్న ఇంటికి చేర్చి, పాపన్న కొక దణ్ణం పెట్టి వెళ్ళిపోయాడు.

సంగప్ప తన ఎత్తుగడ గురించి ముందుగా తన భార్యకు చెప్పలేదు. ఆమె బియ్యమూ, చీరా చూసి, "ఏమిటిది? ఇవి ఎక్కడివి?" అని అడిగింది.

"ఉన్నాడు పరోపకారి పాపన్న అనే ఒక మహానుభావుడు. 'నా కూతురికి పెళ్ళి చెయ్యాలి, మీరే దిక్కు,' అని ఏడుపు ముఖం పెడితే నమ్మాడు వెర్రివాడు! మనకు హాయిగా గడుస్తుంది," అన్నాడు సంగప్ప, తన ప్రయోజకత్వానికి తానే మురిసిపోతూ.

"మంచి ఉపాయమే! కాని, మనకు మొదలు కూతురే లేదని తెలిస్తే గొడవ చేస్తాడేమో?" అన్నది భార్య.

"ఆయన గొడవ చేసే వాడు కాడు. ఎవరో వచ్చి అడిగారు, ఇచ్చాడు! అది అంతటితో చెల్లే. ఆయన కిది జ్ఞాపకం కూడా



ఉండదు. నీ కాయన సంగతి తెలీదు," అన్నాడు సంగప్ప.

సంగప్ప భార్యకు బియ్యంబస్తా కన్న కొత్త చీర బాగా నచ్చింది. ఆమె మర్నాడే దాన్ని కట్టుకుని, వాళ్ళ పల్లెలో తెలిసిన వాళ్ళింటికి వెళ్ళి, "పాపన్నగారు నిన్న మా ఇంటికి వచ్చారు. కాసిని మంచినీళ్ళు తాగి, కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు. నా చీర చినుగుల బొంత అని చూశారో ఏమో, తన భార్య కోసం కొనుక్కుపోతున్న చీర నా కిచ్చి, ఇంటికి వెళ్ళాక ఒక బియ్యం బస్తా కూడా పంపారు," అని ఆ ఇంటి వాళ్ళతో రహస్యంగా చెప్పింది.

అది నిజం కాదని విన్న వాళ్ళకు తెలిసింది. సంగప్ప ఇంటికి బియ్యం బస్తా బండిలో రావటం చాలా మంది చూశారు, కాని పాపన్న రావటం ఒక్కరూ చూడలేదు.

సంగప్ప కరణంగా రింటికి వెళ్ళి ఒక రోజు పని చేస్తా నని కిందటి రోజు మాట ఇచ్చి, డబ్బు తీసుకున్నాడు. కాని వాడు వెళ్ళి ఆ పని చూడలేదు. కారణం తెలుసుకుందామని కరణం పేదపల్లెకు వచ్చాడు. గ్రామస్తులు కరణంగారిని, "ఇలా దయచేశా రేం?" అని అడిగారు.

"సంగప్ప పని చెయ్యటానికి వస్తా నన్నాడు, కాని రాలేదు," అన్నాడు కరణం.





"వాడిం కెందుకు వస్తాడు? బియ్యం బస్తా దొరికిందిగా?" అన్నారు గ్రామస్తులు. వాళ్ళు కరణానికి అంతా చెప్పారు.

కరణం సంగప్ప ఇంటికే వెళ్ళి, రాలే దేమని అడిగాడు.

"నే నిప్పుడు రానులెండి. నాకు ఒంటో బాగాలేదు. మీ దగ్గిర తీసుకున్న డబ్బులకు మరో రో జెప్పు డైనా వచ్చి పనిచేసి పెడతా లెండి," అన్నాడు సంగప్ప కరణంతో.

"పాపన్నగారు నీకో బస్తా బియ్యమూ, నీ భార్య కొక కొత్త చీరా ఇచ్చారటగా? అందుకేనా నీకు ఒంట్లో బాగాలేనిది?" అన్నాడు కరణం.



"వారి ధర్మాన బియ్యమూ, చీరా దొరికిన మాట నిజమే ననుకోండి. కాని నా ఒంట్లో నిజంగానే బాగాలేదు. మీ కంతగా నమ్మకం లేక పోతే మీ కూలి డబ్బులు మీరు తీసుకోండి," అన్నాడు సంగప్ప, డబ్బివ్వబోతూ.

"వద్దులే. పాపన్నగారు నీకు అంత గొప్పగా దానం చేస్తే నేను నీకు రోజు కూలి దానం చెయ్యలేక పోతానా?" అంటూ కరణం అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆయనకు ఆ గ్రామ పెద్ద కనిపించి, "సంగప్ప విషయంలో ఏదో మోసం ఉన్నట్టుగా ఉంది. దాని అంతు కనుక్కో వాలి," అన్నాడు.

ఇద్దరూ పాపన్న ఊరికి వచ్చి, పాపన్నను కలుసుకుని, "పాపన్నగారూ, మీరు దాన ధర్మాలు చేస్తే చేశారు, కాని పాత్రాపాత్ర విచారం చేసి మరీ దానాలు చెయ్యండి. ఎవరి అర్హతకు తగినట్టు వారికి దానం ఇవ్వటం సబబుగా ఉంటుంది. ఆ సంగప్ప మధ్యాన్నం వేళ మీకు కాస్త దాహ మిచ్చి నందుకు ఒక బస్తా బియ్యమూ, కొత్త చీరా ఇచ్చారట. వా డిప్పుడు చేస్తా నన్న పని కూడా చెయ్య నంటున్నాడు. ఇలా వాడు సోమరి అయి కూచుంటే మీరు మాత్రం

ఎంత కాలం వాణ్ణి మేప గలరు? మీ రిచ్చిన కొత్త చీర కట్టుకుని వాడి పెళ్ళాం ఊరంతా ఊరేగుతున్నది," అన్నారు.

వాళ్లు చెప్పిన దేదీ జరగలేదనీ, సంగప్ప తన కూతురి పెళ్ళి నిమిత్తం బియ్యం సహాయం చెయ్యమన్నా డనీ, పోనీ శుభ కార్యం గదా అని తాను చీర కూడా ఇచ్చా ననీ పాపన్న వారికి చెప్పి, "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?" అని అడిగాడు.

"మా వెంట వచ్చి, సంగప్ప మీతో అబద్ధాలు చెప్పినందుకు మీ రిచ్చినది మీరు తిరిగి తీసుకోండి," అన్నాడు కరణం.

"ఇచ్చినది తిరిగి పుచ్చుకోవటం బాగుండదు. కాని నేను మీతో వస్తాను. వచ్చి, నాతో అబద్ధం ఎందుకు చెప్పాడో తెలుసుకుంటాను, పదండి," అంటూ పాపన్న వాళ్ళ వెంట సంగప్ప ఇంటికి వచ్చాడు. ఊళ్ళో ఉన్న జన మంతా సంగప్ప ఇంటి దగ్గర పోగయారు.

ఆ జనాన్నీ పాపన్ననూ చూడగానే సంగప్ప గుండె జారిపోయి, తల వంచుకుని, అంతా ఒప్పేసుకున్నాడు.

పాపన్న తన బియ్యం బస్తా నుంచి సంగప్ప ఖర్చు చేయగా మిగిలిన బియ్యం పల్లె పెద్ద సహాయంతో ఇంటింటికీ సేరు సేరు బియ్యం చొప్పున పంచిపెట్టించాడు.

సంగప్ప భార్య పశ్చాత్తాపంతో కుమిలి పోతూ, పాపన్న ఇచ్చిన చీరె తెచ్చి పాపన్న ముందు పెట్టింది.

"ఫరవాలేదు, ఆ చీర నువే ఉంచుకో. తప్పు చేసినవాడు నీ భర్త. అందుకు నువేం చేస్తావు? మరో సారి ఇలా జరగకుండా చూస్తే చాలు," అన్నాడు పాపన్న. అయినా ఆమె ఆ చీరను తుంపులు చేసి రవికలు లేని వారికి పంచింది.

అది మొదలు ఆ ప్రాంతాల పాపన్నను మోసగించిన వారు బాగుపడ రన్న నమ్మకం వ్యాప్తిలోకి వచ్చింది.






# స్వయం సేవకుడు

ఒక ఊళ్ళో జగన్నాథం అనే గృహస్థు ఉండేవాడు. ఆయన కుమార్తెను పొరుగూళ్ళో, కాస్త హోదా గల చోట ఇచ్చి పెళ్ళి చేశారు.

జగన్నాథం కుమార్తె తొలి కానుపుకు పుట్టింటికి వచ్చి, మగ బిడ్డను కన్నది. కొద్ది మాసాలు గడిచాక జగన్నాథంగారి అల్లుడు ఫలానా రోజున వచ్చి తన భార్యనూ, బిడ్డనూ తీసుకుపోతా నని మామగారికి కబురు చేశాడు.

జగన్నాథంగారు గొప్ప స్థితిపరు డేమీ కాదు. ఉన్నంతలో ఏ లోటూ లేకుండా జీవిస్తున్నా, ఆయన ఇంటి కొక నౌకరును పెట్టుకోలేక పోయినాడు. అదీగాక ఆయన కాస్త లోభ స్వభావంగలవాడు కూడానూ. అల్లుడు స్థితిమంతుడు గనక అతను ఉండే ఒక్క రోజుకైనా ఒక నౌక రుంటే బాగుంటుం దనిపించింది జగన్నాథంగారికి.

అల్లుడు వచ్చే రోజు ఉదయం నుంచీ ఆర్భాటంగా పిండివంటలూ అవీ చెయ్యనారంభించారు.

జగన్నాథంగారు నౌకరు కోసం తెగ తిరిగి ఇంటికి వచ్చి, భార్యతో తన ప్రయత్నం వృథా అయిందనీ, అల్లుడు పిలిస్తే పలకటానికి నౌకరు లేకపోతే ఎంతమాత్రమూ మర్యాదగా ఉండదనీ అన్నాడు.

భార్యాభర్తలు ఈ విషయాలు మాట్లాడుకునే సమయంలో ఒక బిచ్చగాడు పిండివంటల వాసన చేత ఆకర్షించబడి వాకిట నిలబడి, వాళ్ళనుకునే మాట లన్నీ విన్నాడు. మంచి భోజనంతో బాటు పిండివంటలు కూడా ఆరగించాలని వాడికి బుద్ధిపుట్టింది.

ముందు వసారాలో ఎవరూ లేకుండా చూసి వాడు బావి వైపుకు వెళ్ళి, అక్కడ ఉన్న ఒక పాతబట్టా, కొద్దిగా చినిగిన

ఎస్. లక్ష్మణస్వామి

చొక్కా తీసుకుని, తన కుళ్ళు బట్టలు విప్పి ఒక మూలగా పెట్టి, ఈ బట్టలు వేసుకుని, తల కొక తువాలు చుట్టుకుని ఇంటి ముందుకు వెళ్ళి, చేతులు కట్టుకుని గోడ వార నిలబడ్డాడు.

ఈ సమయానికే ఇంటి ముందు జట్కా బండీ ఒకటి వచ్చి ఆగింది. అందులో నుంచి జగన్నాథంగారి అల్లుడు దిగాడు. బిచ్చగాడు చప్పున వెళ్ళి, బండిలో నుంచి పెట్టె దించి చేత బట్టుకుని, అల్లుడి వెనకాలే లోపలికి వచ్చాడు.

బండి ఆగిన చప్పుడు విని, బయటికి వచ్చిన జగన్నాథం అల్లుణ్ణి పలకరించి, వెనకగా వచ్చినవాడు అల్లుడి వెంట వచ్చిన నౌకరే ననుకుని మనస్సులో చాలా ఆనందించాడు.

అల్లుడు మటుకు వాణ్ణి చూసి అత్తవారి నౌకరయి ఉంటా డనుకున్నాడు.

అల్లుడుగారి నౌకరన్న ఉద్దేశంతో జగన్నాథమూ, ఆయన భార్యా కూడా బిచ్చగాణ్ణి కాస్త మర్యాదగా చూశారు. ఏవైనా చిన్న పనులు చెప్పవలిసి వస్తే మంచిగా చెప్పి చేయించుకున్నారు.

లోపల అందరూ భోజనాలకు కూర్చున్న సమయంలోనే జగన్నాథం బిచ్చగాడికి వసారాలో భోజనం పెట్టించి, శ్రద్ధగా



కనుక్కొని వర్తన చేయించాడు. బిచ్చగా డా పూట విందు భోజనం కడుపారా తిని తృప్తిచెందాడు.

భోజనా లయాక జగన్నాథం అల్లుడికి కొత్త బట్టలు పెట్టాడు. జగన్నాథం భార్య ఇన్ని పిండివంటలు మూటగట్టి బిచ్చగాడి కిచ్చి, "నీ పెళ్ళానికీ పిల్లలకూ పెట్టు, నాయనా!" అన్నది.

పొద్దు వాలే దాకా విశ్రాంతి తీసుకుని జగన్నాథం అల్లుడు తన భార్యతోనూ బిడ్డ తోనూ ప్రయాణ మయాడు. బిచ్చగాడే వెళ్ళి ఒక జట్కాబండి మాట్లాడి తెచ్చి, సామానులన్నీ బండిలో పెట్టాడు. జగన్నాథం అల్లుడు అందరికన్నా ఆఖరుకు బండిలో ఎక్కుతూ, తన అత్తవారి ఇంటి నౌకరు గదా అనుకుని బిచ్చగాడి చేతిలో ఒక రూపాయి పెట్టి, "ఉంచుకో!" అన్నాడు.

బండి కదిలాక జగన్నాథం కూతురు తన భర్తతో, "వాడికి డబ్బు లిచ్చి పంపేస్తున్నారు, మీ వెంట వచ్చిన మనిషి కాడా ?" అని అడిగింది.

"కాడే! మీవాళ్ళ నౌక రనుకున్నాను," అన్నాడు అల్లుడు.

"మీ వెంట వచ్చిన నౌకరని మా వాళ్ళు అనుకున్నారు," అన్నది భార్య. ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఏమండీ, ఆ నౌకరు వాళ్ళ బండి వెంట వెళ్ళక ఇంకెటో వెళ్ళిపోతున్నాడు. అల్లుడుగారి నౌకరు కాడు!" అన్నది జగన్నాథంతో ఆయన భార్య.

"అయితే ఎవడు వీడూ?" అన్నాడు జగన్నాథం. వాడు తాను పెట్టిన నౌకరూ కాదు, అల్లుడి వెంట వచ్చిన నౌకరూ కాదు. ఎవడో దారే వెళ్ళే దానయ్య! అలాటి వాణ్ణి మర్యాద చేసినందుకు మండి పడిపోతూ జగన్నాథమూ, భార్యా వాణ్ణి నానాతిట్లూ తిట్టుకుంటూ తలవాకిలి తలుపు మూసి లోపలికి వెళ్ళిపోయారు.





# యుద్ధకాండ

విభీషణుడు వెళ్ళి పుష్పకవిమానం తెచ్చి రాముడి ముందుంచాడు. అది చాలా పెద్దది. అందులో బంగారంతో చేసిన భాగాలున్నాయి. వైడూర్య మణులతో చేసిన ఆసనా లున్నాయి. దానికి బంగారు కమలాలూ, గజ్జెలూ, ఘంటలూ ఉన్నాయి.

"విభీషణా, వానరులు మహత్తరమైన కార్యం సాధించారు. వారిని కానుకలతో సంతోషపెట్టు. అందువల్ల నీకు గొప్ప కీర్తి కలుగుతుంది," అని చెప్పి రాముడు సీతా లక్ష్మణులతో సహా పుష్పకం ఎక్కాడు. అతను సుగ్రీవుడూ మొదలైన వారికీ, విభీషణుడికీ వీడ్కోలు చెప్పి, తాను అయోధ్యకు తిరిగి పోవటానికి వారి అనుమతి కోరాడు.

"మమ్మల్ని కూడా నీ వెంట తీసుకుపోతే మేం నీ పట్టాభిషేకం చూసి ఆనందిస్తాం," అన్నారు వాళ్ళంతా.

"అలా అయితే మరీ సంతోషం," అని రాముడు అందరినీ పుష్పకం లోకి రమ్మన్నాడు. అందరినీ ఎక్కించుకుని పుష్పకం ఆకాశం లోకి లేచింది. అంత మంది ఎక్కినా విమానం ఇరుకనిపించ లేదు.

విమానం పోతూ ఉంటే రాముడు సీతకు రాక్షస వీరులు యుద్ధ భూమిలో చనిపోయిన స్థలాలూ, సేతువూ, విభీషణుడు తనను కలుసుకున్న చోటూ మొదలైనవి చూపుతూ వచ్చాడు. కిష్కింధ కనుచూపు మేర లోకి రాగానే సీత, తార మొదలైన సుగ్రీవుడి భార్యలనూ, ఇతర వానర వీరుల





భార్యలనూ, తన వెంట తీసుకుపోవా లన్న కోరిక ప్రకటించింది. రాముడు సరే నని పుష్పకాన్ని కిష్కింధలో దింపి, సీత కోరికను సుగ్రీవుడికి తెలిపాడు. సుగ్రీవుడు తన అంతఃపురానికి వెళ్ళి, తారతో వానర వీరుల భార్య లందరినీ ప్రయాణం చెయ్యమన్నాడు. తార అందరు వానర స్త్రీలనూ ప్రయాణానికి సిద్ధం చేసింది. వారందరూ బాగా అలంకారాలు చేసుకుని, సీతను చూడాలన్న అభిలాషతో వచ్చారు.

వానరవనిత లందరినీ ఎక్కించుకుని విమానం మళ్ళీ ప్రయాణం సాగించింది. సీతకు రాముడు ఋశ్యమూకం మీద తనను సుగ్రీవుడు కలుసుకున్న చోటు చూపించాడు. అలాగే అతను తనకు శబరి కనిపించిన చోటూ, జటాయువు రావణుడితో పోరాడిన చోటూ, జనస్థానంలో తాము నివశించిన ఆశ్రమమూ మొదలైన వన్నీ సీతకు చూపాడు.

క్రమంగా విమానం అయోధ్యకు చేర వచ్చింది. వానర రాక్షసు లందరూ లేచి నిలబడి దూరాన కనిపించే అయోధ్యా నగరాన్ని ఆశక్తితో చూశారు. కాని రాముడు తిన్నగా అయోధ్యకు వెళ్ళక భరద్వాజాశ్రమంలో దిగి, భరద్వాజమహాముని ద్వారా భరతుడి యోగ క్షేమాలూ, తన తల్లుల యోగక్షేమాలూ తెలుసుకున్నాడు. అతను చైత్రశుద్ధ పంచమి నాడు అయోధ్య నుంచి వనవాసం బయలుదేరాడు. ఇవాళ చైత్ర శుద్ధ చవితి. ఈ రోజుతో సరిగా పధ్నాలు గేళ్ళు నిండాయి. ఆ రోజు రాముడు తన ఆతిథ్యం స్వీకరించి మర్నాడు అయోధ్యకు వెళ్ళాలని భరద్వాజుడు కోరాడు.

రాముడు హనుమంతుణ్ణి పిలిచి, "నీవు అయోధ్యకు వెళ్ళు. దారిలో శృంగిబేర పురంలో గుహుణ్ణి కలుసుకుని నా క్షేమ సమాచారాలు చెప్పు. నా కతను ప్రాణం లాంటి వాడు. అతని ద్వారా నీకు అయోధ్య





వార్తలు తెలుస్తాయి. నా క్షేమ సమాచారం విని అతను చాలా సంతోషిస్తాడు. అయోధ్యకు వెళ్ళి భరతుడికి మన వార్త లన్నీ వివరంగా చెప్పు. నా విజయవార్త విన్నప్పుడు భరతుడి ముఖంలో ఏ మార్పులు కలిగేదీ శ్రద్ధగా గమనించు. ఇంత కాలం రాజ్యభోగా లనుభవించిన వాడికి అవన్నీ పోతాయంటే బాధగానే ఉంటుంది. అందు చేత అతని మనోభావం సరిగా గ్రహించు. అతనికే రాజ్యం చెయ్యాలని ఉంటే అలాగే చెయ్యవచ్చు. అతని కలాటి కోరిక ఉన్నట్టు తోస్తే, మేం అయోధ్యకు చేరక ముందే ఎదురు వచ్చి కలుసుకో," అన్నాడు.



హనుమంతుడు మానవ రూపం ధరించి వాయు మార్గాన బయలుదేరి, గంగా యమునా సంగమం దాటి శృంగిబేరపురం చేరుకుని, గుహుణ్ణి కలుసుకున్నాడు. గుహుడితో, రాముడు రేపు ఉదయం భరద్వాజాశ్రమం నుంచి బయలుదేరి వస్తున్నాడని చెప్పి, హనుమంతుడు బయలుదేరి, అయోధ్యకు కొంచెం దూరంగా ఉన్న నందిగ్రామానికి చేరుకున్నాడు.

అక్కడ భరతు డొక అశ్రమం కల్పించుకుని తపస్వి లాగా ఉంటున్నాడు. పధ్నాలు గేళ్ళూ నిండినప్పటికీ రాము డింకా రానే లేదే అని విచారిస్తున్నాడు. హనుమంతుడు భరతుణ్ణి కలుసుకుని, "రాజా, శుభవార్త తెచ్చాను. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి సంపాదించుకుని, మహాబలులైన మిత్రులతో వస్తున్నాడు. సీతారాముల వెంట లక్ష్మణుడు కూడా వస్తున్నాడు," అని చెప్పాడు.

ఈ మాట వినగానే భరతుడు ఆనంద పారవశ్యంతో మూర్ఛపోయాడు. అతను తిరిగి స్పృహ తెలియగానే హనుమంతుణ్ణి కౌగలించుకుని, "ఈ సంతోష వార్త తెచ్చిన నీవు మనిషివో, దేవతవో నాకు తెలీదు. ఇందుకు నీకు లక్ష గోవులనూ,





అంతటా నీళ్ళూ, పూలూ చల్లారు. రాజ మార్గాలు పూలతోరణాలు కట్టి, గంధం చల్లి రంగు రంగుల ముగ్గులు పెట్టారు. రాజపరివారమూ స్త్రీ జనమూ రామ దర్శనార్థం గుంపులు గుంపులుగా బయలుదేరారు. వేలాది ఏనుగులనూ, గుర్రాలనూ అలంకరించారు. వాటి పైన కొందరూ, రథా లెక్కి కొందరూ బయలుదేరారు. కౌసల్యా, కైకేయీ సుమిత్రల వెనకగా దశరథుడి భార్యలందరూ పల్లకీలెక్కి వచ్చారు. వీరందరితో బాటు నగరవాసు లందరూ నందిగ్రామం చేరుకున్నారు.

రాము డింకా రాడేమని భరతుడు ఆరాటపడి, హనుమంతుడు తనతో అబద్ధం చెప్పాడని సంశయించాడు. కాని అంతలోనే పుష్పకం కనబడింది. అది త్వరలోనే ఎగిరి వచ్చి నేల మీద వాలింది. భరతుడు రాముడికి ఎదురు వెళ్ళి నమస్కరించాడు. రాము డతన్ని ఆలింగనం చేసుకున్నాడు.

వానరవీరు లందరూ మానవ రూపాలు ధరించి ఉన్నారు. భరతుడు వారి నందరినీ పరామర్శించాడు. అతను సుగ్రీవుడితో, "సుగ్రీవా, మే మదివరకు నలుగురం అన్నదమ్ములం. నీ విప్పుడు మాలో అయిదో వాడి వయావు," అన్నాడు. విభీషణుణ్ణి

నూరు ఉత్తమ గ్రామాలనూ, పదహారు మంది అందగత్తె లైన కన్యకలనూ దానంగా ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ చాలాసేపు కూర్చుని మాట్లాడుకున్నారు. రామ వనవాస కాలంలో జరిగిన సంగతు లన్నిటినీ హనుమంతుడు భరతుడికి చెప్పాడు.

భరతుడు శత్రుఘ్నుడితో ఊరంతా అలంకరింపించమనీ, వాద్యాలు ఏర్పాటు చేయమనీ, రాముడి కెదురు వెళ్ళటానికి వేశ్యలను సిద్ధ పరచమనీ అన్నాడు.

నందిగ్రామానికీ అయోధ్యకూ మధ్యనున్న మార్గాన్ని చక్కగా చదును చేశారు.



కూడా, అతను చేసిన సహాయానికి మెచ్చుకున్నాడు.

రాముడు కౌసల్యకూ, ఇతర తల్లులకూ, వశిష్ఠుడికీ నమస్కరించాడు. భరతుడు తన వద్ద ఉన్న రామపాదుకలను రాముడి కాళ్ళకు స్వయంగా తగిలించాడు. తరవాత అతను రాముడికి చేతులు మోడ్చి, "రాజా, నీ రాజ్యాన్ని నీవు తీసుకో. ఈ రాజ్యం తిరిగి నీకు అప్పగించటంతో నా జన్మ ధన్యమయింది. నీవు వెళ్ళే నాటి కన్న ఇప్పుడు బొక్కసమూ, ధాన్యమూ, సైన్యమూ పదింత లున్నది," అన్నాడు.

రాముడు నందిగ్రామం చేరుతూనే పుష్పక విమానాన్ని కుబేరుడి వద్దకు పంపేశాడు.

అందరూ కూర్చున్న మీదట భరతుడు రాముడితో, "అన్నా, నీవు నా తల్లిని సంతోష పెట్టటానికి రాజ్య త్యాగం చేసి వనవాసం వెళ్ళావు. ఈ రాజ్యాన్ని నా కిచ్చావు. నా వద్ద ఇల్లడగా ఉన్న రాజ్యాన్ని నీవు తిరిగి తీసుకో. దీన్ని నీవు కోర కుండానే తొందరపడి ఎందు కిచ్చేస్తున్నా నంటావేమో, ఈ రాజ్య భారం వహించటానికి నీ కున్న దార్ఢ్యం నాకు లేదు. హంసతో సమంగా కాకి ఎలా ఎగురు



తుంది? మన తండ్రి పుత్రకామేష్టి చేసి నిన్ను ఎందుకు కన్నాడో ఆ ప్రయోజనం తీరాలంటే నీవే రాజ్య భారం వహించాలి, మమ్మల్నందరినీ పాలించాలి," అన్నాడు.

భరతు డన్న దానికి రాముడు సమ్మతించాడు.

ముందు భరతుడూ, తరవాత లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ మంగళ స్నానాలు చేశారు. రాముడి జుట్టు చిక్కు తీసి సరిచేశారు, శరీరానికి లేపనాలు పూశారు, మాలలు ధరింపజేశారు. పీతాంబరం కట్టించారు. అతను సింహాసనం పైన కూర్చున్నాడు. దశరథుడి భార్యలు సీతను



చక్కగా అలంకరించారు. కౌసల్య వానర భార్య లందరికీ అలంకారాలు చేయించింది.

సుమంత్రుడు ఉత్తమాశ్వాలు పూన్చిన రథం తెచ్చాడు. రాము డందులో ఎక్కి కూర్చున్నాడు. రథం అయోధ్య కేసి బయలుదేరింది. సుగ్రీవ హనుమంతులు స్నానాలు చేసి, మంచి బట్టలు ధరించి, కుండలాలు ధరించి బయలుదేరారు. సీత సుగ్రీవుడి భార్యలతో కలిసి బయలుదేరింది.

దశరథుడి మంత్రులు వశిష్ఠుడితో సహా ముందుగానే అయోధ్యకు వెళ్ళి పట్టాభిషేకం ఏర్పాట్లు ప్రారంభించారు. తరవాత మంత్రులు రాముడి కెదురు వచ్చారు.

రాము డెక్కిన రథానికి కట్టిన గుర్రాలు పచ్చనివి. భరతుడు సారథిగా కూర్చున్నాడు. శత్రుఘ్నుడు ఛత్రం పట్టాడు. లక్ష్మణుడు వింజామర పట్టాడు. విభీషణుడు మరొక వింజామర పట్టాడు.

సుగ్రీవుడు శత్రుంజయ మనే మదగజాన్నెక్కాడు. రాముడి వెంబడి శంకాలూదారు. భేరీభాంకారాలూ, జనుల కోలాహలమూ మిన్ను ముట్టాయి. రాముడు అయోధ్య ప్రవేశించే సరికి ప్రతి ఇంటి మీదా జెండా ఎగిరింది. అతను తిన్నగా దశరథుడి ఇంటికి వెళ్ళి, సుగ్రీవుడికి విడిది చూపమని భరతుడితో చెప్పాడు.

సుగ్రీవుడు విడిది చేరుతూనే నాలుగు సువర్ణ కలశాలను నలుగురు వానరోత్తముల కిచ్చి, మర్నాడు తెల్లవారే లోపుగా వాటితో సముద్రజలం తీసుకు రమ్మన్నాడు. వాళ్ళు కలశాలు తీసుకుని ఆకాశ మార్గాన బయలుదేరి వెళ్ళారు. అలా వెళ్ళిన వారు జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూనూ.

తరవాత రామపట్టాభిషేకం జరిగింది. సీతారాములను రత్న పీఠం పైన కూర్చోబెట్టారు. వసిష్ఠుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, సుయజ్ఞుడూ,



గౌతముడూ, విజయుడూ అనే ఎనిమిది మంది మహర్షులూ రాముడికి అభిషేకం చేశారు. వారి అనంతరం బ్రాహ్మణులూ, కన్యలూ, మంత్రులూ, పౌరులూ, యోధులూ రాముణ్ణి అభిషేకించారు.

శత్రుఘ్నుడు రాముడికి ఛత్రం పట్టాడు. సుగ్రీవ విభీషణులు వింజామరలు పట్టారు. దేవేంద్రుడు వాయుదేవుడి ద్వారా నూరు కమలాలతో కూడిన బంగారు హారాన్నీ, నవరత్న హారాన్నీ పంపాడు.

రాముడు బ్రాహ్మణులకు లక్ష గుర్రాలనూ, దూడలు గల లక్ష ఆవులనూ, నూరు ఆబోతులనూ దానం చేశాడు; ముప్పై కోట్ల బంగారు నాణాలనూ, వస్త్రాలనూ, నగలనూ దానం చేశాడు, సుగ్రీవుడి కొక దివ్యమైన కాంచనమాలను బహూకరించాడు. సీత కొక ముత్యాల హారం ఇచ్చాడు. సీత హనుంతుడికి రెండు బట్టలు పెట్టి, అందమైన నగలిచ్చింది.

రాముడు సీతకు ఒక ముత్యాల హారం ఇచ్చి, "నీకు ఎక్కువ సంతోషం కలిగించిన వాడికి ఇచ్చెయ్యి," అన్నాడు. సీత దాన్ని హనుమంతుడి కిచ్చింది. హనుమంతుడు దాన్ని వెంటనే మెడలో వేసుకున్నాడు.

రాముడు ఇతర వానర ప్రముఖులకూ, విభీషణుడికీ యథోచితమైన కానుకలిచ్చాడు. పట్టాభిషేకం ముగియగానే రాముడి వద్ద సెలవు తీసుకుని వానరులూ, విభీషణుడూ తిరిగివెళ్ళిపోయారు.

రాముడు రాజ్య భారం సగం లక్ష్మణుడిపైన ఉంచి, భరతుణ్ణి యువరాజుగా అభిషేకించి కీర్తివంతంగా రాజ్యం చేశాడు. అతను నూరు అశ్వమేధాలు చేశాడు. రాముడి పరిపాలనలో ప్రజలకు ఎలాటి ఈతి బాధలూ లేవు, అకాల మరణాలు లేవు. రామరాజ్యం అంటే ఆదర్శవంతమైన రాజ్యం అనే అర్థం ఏర్పడింది.

[ యుద్ధకాండ సమాప్తం ]





# ఔత్తమ మనువు కథ

ఉత్తానపాదుడికి సునీతీ, సురుచీ అని ఇద్దరు భార్యలు. వారిలో సునీతికి కొడుకుగా పుట్టిన వాడు ధ్రువుడు. సురుచి కొడుకు ఉత్తముడు. ఉత్తానపాదుడికి సురుచి మీదనే ప్రేమ హెచ్చు; ఆ కారణం చేత ఉత్తము డంటే ఎక్కువ ఇష్టంగా ఉండి, రాజ్యం అతనికే ఇచ్చాడు.

ఉత్తముడు బభ్రుడి కూతురైన బహుళను పెళ్ళాడాడు. బహుళ అంటే అతనికి వెర్రి ప్రేమ. కాని బహుళకు తన భర్త పైన ఆదరం చాలా తక్కువ, అతన్ని లోకువగా చూసి అవమానిస్తూ ఉండేది.

ఒకనాడు ఉత్తముడు కొందరు రాజ కుమారులతో కలిసి మద్యం తాగుతూ పాన పాత్రను తన భార్య కివ్వబోయాడు. ఆమె దాన్ని తీసుకోక ముఖం తిప్పేసుకున్నది. ఉత్తముడికి రాజకుమారుల సమక్షంలో అవమానం కలిగింది. అందుచేత అతను తన భార్యను అడవులకు పంపేశాడు. అందుకు బహుళ విచారించకపోగా తన భర్త ముఖం కనపడదుగదా అని సంతోషించింది. ఉత్తముడు మాత్రం భార్యా వియోగంతో బాధపడి, మరొక భార్యను చేసుకోవటానికి కూడా ఇష్టపడకపోయాడు.

కొంత కాలం గడిచింది. ఒకనాడు సుశర్మ అనే బ్రాహ్మణుడు రాజ సభకు వచ్చి, "రాజా, నా భార్యను ఎవడో ఎత్తుకు పోయాడు. ఆమె జాడ తెలియటంలేదు. నీ వామెను వెతికి తెచ్చి ఇయ్యి," అన్నాడు.

"నాకు నీ భార్య ఎవరో తెలీదు, ఆమె నెత్తుకు పోయిన వాడూ తెలీదు;" అన్నాడు ఉత్తముడు.

"తెలీదనగానే సరిపోతుందనుకున్నావా? ప్రజల ధనంలో ఆరోవంతు పన్నుగా దేనికి పుచ్చుకుంటున్నావు? మా బాధలు నివారణ చేసే బాధ్యత నీదే," అన్నాడు సుశర్మ.

అట్ట చివరి బొమ్మ

"నీ భార్యను గురించి వివరాలు చెప్పు. ఆమె ఎలా ఉంటుంది? వయసెంత?" అన్నాడు రాజు.

"దాని గుడ్లు మిడిగుడ్లు. పొట్టిగా ఉంటుంది. చిన్న చేతులుంటాయి. ముఖం పీక్కుపోయి మహా వికారంగా ఉంటుంది. వయసు మళ్ళిన మనిషి. నేను దాన్ని పల్లెత్తు మాట అనను, అదే నన్ను నానా మాటలూ అంటుంది. దానిది సాధుబుద్ధి కాదు," అన్నాడు సుశర్మ.

"ఓయి వెర్రి బ్రాహ్మడా! అటువంటి భార్య పోయినదే మేలని సంతోషించక ఎందుకు వెతకమంటావు? నిక్షేపంగా ఇంకో భార్యను చేసుకుని సుఖంగా ఉండు," అన్నాడు ఉత్తముడు.

"ఎటువంటి భార్యనైనా సరే రక్షించుకో వలసిన బాధ్యత భర్తది. భర్త సంతానం రూపంలో భార్య గర్భాన అనేకమార్లు జన్మిస్తాడు. అలాటి భార్యను రక్షించుకోక పోతే సాంకర్యం ఏర్పడుతుంది. గురువు వద్ద ప్రమాణం చేసి, అగ్నిలో సమిధలు వేల్చి చేసుకున్న భార్యను వదిలిపెట్టి మరొకతెను ఎలా పెళ్ళాడను? నా ఇంటికి అగ్నితో సహా వచ్చిన భార్య లేకుండా ఏ కర్మా చెయ్యటానికి అవకాశం లేదే!" అన్నాడు సుశర్మ.



ఈ మాట విని ఉత్తముడు రథ మెక్కి అనేక ప్రదేశాలు గాలించి, చివర కొక ముని ఆశ్రమం చేరాడు.

ఆ ముని రాజు కోసం అర్ఘ్యం తెమ్మని శిష్యుడితో అన్నాడు. శిష్యుడు గురువు చెప్పినట్టు చెయ్యక, "కొంచెం ఆలోచిం చండి," అన్నాడు గురువుతో.

అప్పుడు ముని రాజు పరిస్థితి జ్ఞప్తికి దెచ్చుకుని, "రాజా, ఒక పక్షం రోజులు కర్మ త్యాగం చేస్తే బ్రాహ్మణుడు సైతం అస్పృశ్యు డౌతాడంటారు. నీవు ఏడాది పాటు నీ భార్యను వదిలిపెట్టావు," అన్నాడు కోపంగా.

ఉత్తము డా మాట విని వెలవెల పోయాడు. అతనా మునికి తాను వచ్చిన పని చెప్పగా ముని దివ్యదృష్టితో చూసి, "సుశర్మ భార్యను బలాకుడనే రాక్షసుడు తీసుకుపోయి కుత్పలావత మనే అర ణ్యంలో ఉంచాడు. నీ వామెను తీసుకు పోయి సుశర్మ కిచ్చి, నీకు కలిగిన పాపం ఆ బ్రాహ్మణుడికి కలగకుండా చూడు," అని చెప్పాడు.

ఉత్తముడు బలాకు డుండే చోటికి వెళ్ళి, అక్కడ సుశర్మ భార్య ఉన్న సంగతి తెలుసుకుని, బలాకుడితో, "ఏం కోరి నీ వీమెను తెచ్చావు?" అని అడిగాడు.



"ఈమె భర్త ప్రతి యజ్ఞంలోనూ మా రాక్షసులను ఉచ్చాటన చేస్తున్నాడు. ఆయనకు కర్మ సాగకుండా ఆయన భార్యను తెచ్చాను," అన్నాడు బలాకుడు. అతను ఆమెను ఆమె భర్త దగ్గిర చేర్చ టానికి ఒప్పుకున్నాడు. తరవాత ఉత్తముడు ముని వద్దకు తిరిగివెళ్ళి, "భార్యను విడిచి పెట్టటం ఎంత తప్పో మీరు చెప్పారు. అదే మరొక విధంగా బలాకుడు కూడా చెప్పాడు. నా భార్య ఎక్కడ ఉన్నదో చెప్పండి," అని కోరాడు.

"నీ భార్య పాతాళంలో ఉన్నది. కపోత రాజనే నాగుడు ఆమెను ప్రేమించి తీసుకు పోయాడు. అయితే అతని కుమార్తె నంద అనేది నీ భార్య తనకు సవతితల్లి కావటం ఇష్టంలేక ఆమె శీలాన్ని కాపాడుతున్నది," అన్నాడు ముని.

రాజు ఇంటికి తిరిగివచ్చి, సుశర్మా భార్యా ఎంతో అన్యోన్యంగా ఉండటం చూసి సంతోషించి, బలాకుణ్ణి తలుచు కున్నాడు. బలాకుడు రాజు కోరికపై పాతా ళానికి వెళ్ళి బహుళను తీసుకు వచ్చాడు. సుశర్మ మిత్రవింద అనే యజ్ఞాన్ని ఏడు సార్లు చేసి బహుళలో గల కల్మషాన్ని నిర్మూలింపజేశాడు.

బహుళ కిప్పుడు భర్త పైన అమితమైన అనురాగం పుట్టుకొచ్చింది.

తాను ప్రేమించి తీసుకువచ్చిన బహుళ తనకు దక్కకుండా చేసినందుకు కూతురి పైన కపోతరాజు మండిపడి ఆమెకు మాట పడిపోయేలాగ చేశాడు. నందకు ఈ విధంగా కలిగిన మూగతనాన్ని పోగొట్టటానికి రాజు సారస్వతయజ్ఞం చేయించాడు. నందకు మూగతనం పోయింది. ఆమె ఉత్తముణ్ణీ, బహుళనూ మను వయేవాణ్ణి కనమని ఆశీర్వ దించి పాతాళానికి తిరిగి వెళ్ళిపోయింది. ఆమె దీవించినట్టే వారికి ఔత్తము డనే వాడు పుట్టి మూడవ మనువయాడు.



# ప్రపంచపు వింతలు: 44. 16వ శతాబ్ది గడియారం

ఈ గడియారం స్విజర్లాండు రాజధాని అయిన బెర్న్ లో ఉన్నది. ద్వారానికి ఎగువన ఉన్న చిన్న "డయలు" నెలా, రోజూ తెలుపుతుంది. దానికి కుడి పక్కన ఉన్న కట్టడం మీద ఎలుగుబంట్లూ, కోడీ ఆడతాయి. గడియారం పై భాగాన గల గోపురంలో బొమ్మ మనుషులు గంటలు కొడతారు.



Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

తెప్పైప నీళ్ళపై తేలింది

పంపినవారు:
ఎన్. ఎమ్. రావు, విశాఖ

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

రప్పై రాళ్ళలో దాగింది

పంపినవారు :
ఎస్. ఎమ్. రావు, విశాఖ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి)

★ జులై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జులై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తెప్పె నీళ్ళపై తేలింది

రెండవ ఫోటో : రప్పె రాళ్ళలో దాగింది

పంపినవారు : ఎస్. మాధవరావు,

బుక్క స్ట్రీట్, విశాఖపట్నం.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# అమృతాంజనం వాడి
## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం.




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2816

## పాటలు పాడే బొమ్మలతో చిన్న పిల్లలకు పుస్తకం

రంగు రంగుల అందమైన బొమ్మలతో చిన్న పిల్లలకు విద్యాబోధన చేయడమనే అంశం క్రొత్తదేమీ కాదు. ఈ బొమ్మలకు తోడు రకరకాల ధ్వనులు. ఆ ధ్వనులను చేసే బొమ్మలు వుంటే చిన్న పిల్లలు ఇంకా త్వరగా అక్షరాలు, మాటలు నేర్చుకొన గలుగుతారు.

సంగీతయుక్తంగా పాటలు పాడుతూ, రకరకాల ధ్వనులు చేసే బొమ్మలను, ఆ బొమ్మలకు సరిపడే అక్షరాలను కలిగిన అందమైన చిన్న పిల్లల పుస్తకం ఒకటి మా కార్యాలయం చేరింది. 'అ' మొదలు 'అః' వరకూ అక్షరాలు ఇందులో వున్నాయి. ప్రతి పేజీని చేతితో నొక్కితే రకరకాల ధ్వనులు వినిపిస్తాయి. పాఠశాలకు రేపో, మాపో వెళ్లనున్న పిల్లలకు ఇది ఎంతో ఉపకరిస్తుంది. ఈ పుస్తకంతో ఆడుకొంటూ, బొమ్మల వైపు పదే పదే చూడడంవల్ల చిన్న పిల్లల మెదడులో అక్కడి అక్షరాలు బాగా నాటుకపోయి బాగా గుర్తుంటాయి.

ఈ పుస్తకం అధునికంగా వుంది. ఇన్ని చక్కని ఆకర్షణలు కలిగిన పిల్లల పుస్తకం రావడం తెలుగులో ఇదే ప్రథమం.

వెల రు. **1-50**

హిగ్గిన్‌బాదమ్స్ ప్రైవేటు లి.

**165,** మౌంటు రోడ్డు, మద్రాసు-**2.**

# అందరూ తప్పు నాదే అన్నారు

కుటుంబములో అందరూ నా ఉద్యోగము పోవడానికి తప్పు నాదే అన్నారు. కాని ఆ స్త్రమానమూ ఎంతో అలసటగా యీడురోమని ఉంటే నేను మాత్రము ఏమి చేయగలను?












పూర్తిగా పోషణలేని కారణముగా నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. పూర్తి మీగడ గల పాలకు తోడు గోధుమపిండి, మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారములతో హార్లిక్స్ రుచిగా ఉంటుంది, తప్పకుండా పనిచేస్తుంది!

## హార్లిక్స్

*అదనపు శక్తిని కలిగించును!*

WTHL 3494

CHANDAMAMA (Telugu) JULY 1965 Regd. No. M. 4854



ఔత్తమ మనువు కథ